# రగిలింది పోరు

— శ్రీధరన్

నెల్లూరు జిల్లాలో రగిలింది పోరు
అందరొక్కటై కదిలిరే - సారాదొరల గుండె లదిరేనే
సారమ్మనియ్యం పాట పాడొద్దని
సర్కారు దోపిడి అంతమవ్వాలని
ఊరికి జీపొస్తె తగలేస్తమన్నరు
కొడవల్లందుకొని కదిలిరే - గుత్తెదారుల తరిమికొట్టిరే ॥నెల్లూరు॥
పల్లె నుండి పోరు జిల్లంత పాకింది
ఉప్పెనోలె పోరు ఊరూరు చుట్టేసి
ఉగ్రరూపంతోటి పట్నాల కొచ్చింది
ఆంధ్రదేశమంతా నెల్లూరు జిల్ల యితే
సారా దోపిడంతమవ్వునులే - జనం పోరు గెల్చి తీరులే ॥నెల్లూరు॥
కరీంనగరులోన అక్కలన్నలు కలిసి
బువ్వ గావాలని భూమి గావాలని
సారాయి వద్దంటు పోరు సాగించితే
రక్కసి సర్కారు పోలీసుల బంపె
ఆ పోరు మంటలే అగ్గిలా - అంటుకున్నాయమ్మ అంతటా
మన ఊరి దొరోడు పేదల్ని దోచిండు
కష్టజీవుల సొత్తు కాజేసి బల్సిండు
భూముల్ని గుంజుకొని భూస్వామి అయ్యిండు
కల్తి సారమ్మిండు కాంట్రాక్టరయ్యిండు
మంత్రులండ జేరి వాడు - అరె కోట్లకు పడగెత్తినాడు
సర్కారు ఏదైన ఏ పార్టి ఏలినా
అన్ని పార్టీల్లోన సార దొరలున్నారు
సారమ్మెటోల్లంత మంత్రులైతున్నారు
కూడుగుడ్డడిగితె తుపాకీ చూపింద్రు
మంత్రులంతా తాగుబోతులే - దోపిడి దొంగల రాజ్యమే
మతపిచ్చి లేపిండు మందిని చంపిండు
ప్రజల నెత్తురు తాగి ముఖ్యమంత్రయ్యిండు
సారమ్మినట్లుగా సదువమ్మె తాడంట

(మిగతా 29 వ పేజీలో)

# ప్రజాసాహితి

సాహిత్య సాంస్కృతికోద్యమ మాస పత్రిక


సంపుటి : 16 సంచిక : 1

అక్టోబర్ 1992



రచనలు పంపవలసిన చిరునామా :

నిర్మలానంద,

వర్కింగ్ ఎడిటర్,

29-28-67, దాసరివారివీధి,

సూర్యారావుపేట,

విజయవాడ - 520 002.

మేనేజర్, ప్రజాసాహితి,

29-28-67, దాసరివారి వీధి,

సూర్యారావు పేట,

విజయవాడ-520 002.

ఏజంట్లు, చందాదారులు

వ్రాయవలసిన అడ్రస్,

ఇతర వివరాలకు :

కొత్తపల్లి రవిబాబు, ప్రధానకార్యదర్శి

జనసాహితి, నగరం-522 268.



వెల : రూ. 5 సం॥ చందా రూ. 50





ముఖచిత్రం :

మోహన్

(ప్రగతిశీల మహిళా సంఘం-స్త్రీ విముక్తి

వారి పోస్టర్ల నుండి)



కవరు లోపల రెండవ పేజీలో :

రగిలింది పోరు (జనం పాట)

—పరమేశన్



మూడవ కవరు పేజీ :

ఎందాకని సహించం (కవిత)

—వి. రామారావు



నాలుగవ కవరు పేజీ :

వద్దు! వద్దు! తాగొద్దు! (జనంపాట)

—విన్.

## ఈ సంచికలో...

ప్రధానంగా contents దృష్ట్యా, కన్యాశుల్కంపై ప్రత్యేక సంచికగా వచ్చిన 'ప్రజాసాహితి' అన్నివిధాల బాగా వచ్చింది.

—వి. రామకృష్ణ, హైదరాబాద్.




సమకాలీన పరిస్థితులకు గురజాడ అవగాహనను అన్వయిస్తూ సంచికలో చాలా వ్యాసాలు వున్నాయి.

—అద్దేపల్లి రామమోహనరావు, కాకినాడ.

ఈ సంచికలో 'దేశమంటే మనుషులోయ్' కథ నాకు చాలా బాగా నచ్చింది. మధురవాణి మీద ఛాయరాజ్, వసీరాలు రాసిన కవితలు కన్యాశుల్కం నాటకం విశిష్టతను తెలియ చేస్తున్నాయి. కాకరాలగారి వ్యాసం రెండు భాగాలుగా విడగొట్టివుంటే బాగుండేది. నవీన్‌గారు తన వ్యాసంలో గిరీశం ప్రవృత్తులన్నీ గురజాడలో వుండే వుంటాయని చెప్పడానికి సాహసించారు- ఇది చాలా అన్యాయం.

—వరలక్ష్మి, రణస్థలం.

'దేశమంటే మనుషులోయ్' కథ బాగుంది. చిత్ర అభినందనీయులు. నవీన్‌కు గల వ్యక్తిగతమైన ఉద్దేశాలను గురజాడకూ, చదివేవారికీ అంటగట్టడం దుర్మార్గం; ఈ వ్యాసంలోని అతని ప్రధాన ఉద్దేశాన్ని, డా॥ పి.వి. రమణ ఇదివరకే తన ఆలోచనా పరిధిలో ఆంధ్రజ్యోతి సాహిత్య పేజీలో రాశారు. దివికుమార్ వ్యాసం పత్రిక ప్రతిష్టను పెంచింది. రవిబాబు వ్యాసం చక్కగా వుందిగాని అర్ధాంతరంగా ముగించి నట్టనిపించింది.

—సూర్యతేజ, శ్రీకాకుళం

ఛాయారాజ్, అల, వసీరాల కవితలు చాలా బావున్నాయి. వారికి నా అభినందనలు. వ్యాసాలన్నీ విభిన్న దృక్పథాల్నించి వచ్చి ఆలోచింపజేసేవిగా వున్నాయి.

వాటిలో శ్రీశ్రీది ఇదివరలో చదివిందే. రవిబాబు 'జీవ' కన్యాశుల్కం దాన్ని అర్థం చేసుకోవల్సిన వ్యూ పాయింట్‌ని సూటిగా విశ్లేషణాత్మకంగా ప్రతిపాదించింది. డా॥ సంజీవదేవ్ వ్యాసం మధురవాణి పాత్ర చిత్రణలోని లోతుల్ని గొప్పగా వివరించింది. డా॥ చప్ప సూర్యనారాయణగారు అబ్బూరి వ్యాసాన్ని సమీక్షిస్తూ పరిచయం చెయ్యడంవల్ల ఒక ప్రయోక్త ఆ నాటకాన్ని ఎలా అర్థం చేసుకున్నదీ, అర్థం చేసుకోవల్సిందీ పాఠకులికి అవహన కల్గుతుంది.

డా॥ యం.వి. నరసింహమూర్తిగారు కన్యాశుల్కం మినహా మిగిలిన అప

పూర్ణ నాటకాలమీద చేసిన తీర్పులలో ఏకీభవించలేకపోతున్నా- వారు చేసిన తీర్పులకు అనుగుణమైన అవస్థలోపడిన రచయిత తన అసంపూర్ణ రచనల్ని వదిలేయడమే మంచిదన్న సూచన సూత్రం సమర్థనీయమే.

జి. భవాని స్త్రీ పాత్ర చిత్రణ వ్యాసంలో యోగినిని వదిలేసిన కారణమేమిటో తెలీదుగాని అలా వదిలేయడం వెలితేననిపించింది. ఆ మేరకి జీవితంలో భాగమైన స్త్రీత్వంలో అపార్థాన్ని విస్మరించినట్టేనని నా ఉద్దేశం. అయినా- ఇది మినహా- వారి వ్యాసం ఆలోచింపజేసే సమాచారాన్నే అందించింది.

కథ చదవలేదు. జనార్ధనరెడ్డిగాడి మీద కరపత్రం బాగుంది. వి. రామకృష్ణ, దివి కుమార్, కఠెవరపు వెంకట్రామయ్యగారి వ్యాసాలు కన్యాశుల్కం విశిష్టతని సాంఘిక నేపథ్యాన్ని అర్థం చేసుకుందుకి దోహదం చేస్తాయి.

కథ అడ్డంగా తిరిగింది, నాటకేషు కన్యాశుల్కం సమీక్షా వ్యాసాల రచయితలతో నేను ఏకీభవిస్తున్నాను. విశాఖ ప్రదర్శన నేను చూడకపోయినా వారీమధ్య వేస్తున్న ప్రదర్శనలు చూశాను. పామరుడు వ్యంగ్యంగా చురకలేసినా, గో.నా. సీరియస్‌గా వ్యక్తం చేసినా వారు వివరించింది కరెక్ట్. కన్యాశుల్కాన్ని ఆ విధంగా ప్రదర్శించడం ఏ కమర్షియలైజ్‌డు రంగస్థలాన్ని ప్రతిఘటిస్తూ అదొచ్చిందో ఆ మూల లక్ష్యాన్ని విస్మరించి, దాన్నే కమర్షియలైజ్ చెయ్యడం. దాని విషయంలో అది దారుణమైన నేరమే.

జె.వి. సోదరుల నటరాజ కళాసమితిలో ఒకటి రెండు ప్రదర్శనలు నేనూ ఏదో పాత్రలు వేశాను. అప్పుడు యీ స్థాయిలో ఈ విధంగా లేదు. ఇదీమధ్య పెరిగిన పైత్యమే. కానీ రమణమూర్తిగారికి మాత్రం గిరీశం పాత్రతత్వం ఆషాఢభూతి తత్వంగా భావిస్తూనే దాన్నే నాయకుడిగా, హీరోగా- చూసే కన్వెన్షన్ మొదట్నించీ వుంది. గిరీశం బుచ్చెమ్మ విషయంలో సిన్సియరేనన్నది వారి వాదన

ఆయనతో అతి సన్నిహితంగా వున్నాను గనక ఆయనని అర్థం చేసుకోగలను. కాని నాకీ సంచికలో మింగుడు పడనిది నవీన్ "గిరీశం పాత్ర విశిష్టత" వ్యాసం. నవీన్ అంటే అంపశయ్య నవీనా? లేక మన ప్రజాసాహితి నవీనా? కాక యింకెవరైనా నవీనా? ఆ వాదం సమర్థనీయం కాదు సరికదా ప్రమాదకరమని నా ఉద్దేశం. అందుకు ఆయన రా.రా.ని కూడా తోడు తెచ్చుకోడం మరీ విచిత్రంగా వుంది. ఈ సంచికలోని వ్యాసాల్లో నేను పూర్తిగా ఏకీభవించలేకపోతున్నది దీనితోనే.

వ్యాసాల మీద కేవలం నా స్పందనని రాశానంతేగాని వ్యాసాలూ, కవితలు అన్నీ పాఠకుల మెదడుకి పదును పెట్టేలా "కన్యాశుల్కం ప్రదర్శన శతజయంతి సంచిక" చాలా బాగా వచ్చింది.

—కాకరాల, మద్రాసు.

(మిగతా 53 వ పేజీలో)

## సంపాదకీయం

# చైతన్య మహిళాలోకానికి జేజేలు!

లక్షలాది కంఠాల నినాదాల హోరు నేటి పాలకుల్ని కంపింప జేస్తున్నది. మహిళల ఆవేశపు పిడికిళ్ళ హెచ్చరికకు సారా రాజకీయ సామ్రాట్టులు గజ గజా వణికిపోతున్నారు. మహిళా ఉద్యమ పద ధ్వనుల కదంతాల్కు రాష్ట్రమంతటా ప్రతి ధ్వనులు వినిపిస్తున్నాయి. సారా వ్యతిరేకోద్యమ వీరాంగనల ఆగ్రహ జ్వాలల్లో సారా పొట్లాలు భగ్గున మండి మసై పోతున్నాయి. సారా జీపులు భయపడి తుర్రు మంటున్నాయి. పైర్లు పంచరై తుస్సుమంటున్నాయి.

గతంలో తెలంగాణాలో జరిగిన సారా వ్యతిరేక ఆందోళనకి నక్సలైట్ బూచి పేరుతో అడ్డుకట్టలు వేయగలిగిన పరిపాలకులు ఈనాడు మహోద్యమం ముందు నైతికంగా నిలువలేక పోతున్నారు. మహాకవి గురజాడ అన్నట్టు "ఆధునిక మహిళలు చరిత్రను తిరగ రాస్తున్నారు." సామాన్య స్త్రీ జనావళి గుండెలు మండి మండి రగులుతున్న ఈ ఉద్యమం, రాజకీయ విభేదాల కతీతంగా విస్తృతి గాంచు తోంది. నెల్లూరు జిల్లాలోనైనా సారా వేలం పాటలను వాయిదా వేయించగలిగారు.

ప్రజలలో వున్న అనేక సామాజిక, వ్యక్తిగత దురలవాట్లను రూపుమాపి నూతన సంస్కృతి వైపు నడిపించాల్సిన ప్రభుత్వం, తానే పెద్ద సారా పొట్టులా మారిపోయింది. రాష్ట్ర వ్యాపితంగా మద్యపాన నిషేధాన్ని తొలగించిన 1968వ సం॥లో 30 కోట్ల రూ॥ల వ్యాపారం, ఈనాటికి 900 కోట్లకు చేరుకుంది. సారా కాంట్రాక్టర్లు మరొక 2000 కోట్ల రూ॥లు స్వాహా చేస్తున్నారు. మనిషి చేత పశు వుల్లా పని చేయించుకోడానికి దోపిడీ వర్గాలు సారా నొక సాధనంగా వాడుకొంటు న్నారు. ప్రజల సామాజిక చైతన్యాన్ని మొద్దుబార్చి, తమ జీవిత సమస్యల గురిం చిన ఆలోచన పెరగనివ్వకుండా చేసుకుంటున్నారు. రాజకీయ ప్రాబల్యాలకి, ప్రలో భాలకీ దీన్నొక ఆయుధం చేసుకుంటున్నారు.

అనేక సామాజిక ఉద్రిక్తతలకూ, నేరాలకూ-ముఖ్యంగా మహిళలపై అత్యా చారాలకూ, అఘాయిత్యాలకూ సారా ప్రేరణ కలిగిస్తోంది. ఉతన సాంస్కృతిక విలువలకు దోహద పడుతోంది. ఒక్క మాటలో చెప్పాలంటే - ప్రజలను అణచి వుంచడానికీ, సంఘటితం కానివ్వకుండా చేయడానికీ, పక్కదారి పట్టించడానికీ పాల కుల చేతిలో పరికరమైందీ సారా. పాలకుల కొచ్చే కోట్లాది రూపాయలకన్నా అణచి వేత రూపంగా ఉపయోగపడటమే మిన్నగా వుంది.

సారాకు వ్యతిరేకంగా నెల్లూరు జిల్లా మహిళలు ప్రభంజనంలా చెలరేగితే వారి ప్రభావం రాష్ట్రమంతా సుడిగాలిలా వ్యాపించింది. తరతమ స్థాయిల్లో అన్ని జిల్లాల్లోనూ ఆందోళన విస్తరించింది. తమ జీవితాలనీ, కుటుంబాలనూ ఛిన్నాభిన్నం చేసి కష్టాలూ, కడగండ్లుగా మార్చేస్తున్న సారాకు వ్యతిరేకంగా రాష్ట్ర వ్యాపితంగా మహిళాలోకం సాగిస్తున్న పోరాటానికి 'ప్రజాసాహితి' జేజేలు పలుకుతోంది. ఉద్యమానికి హృదయపూర్వకంగా సంపూర్ణ మద్దతు నందిస్తోంది.

సమస్త నైతిక విలువలనూ విడిచిపుచ్చిన ప్రభుత్వాలు, నిరంకుశత్వానికీ, అవినీతికీ అలవాటు పడిపోయిన దాని యంత్రాంగం, మహిళా ఉద్యమ ఫలితంగా "తాగుడుని నిషేధించినా" తమకు అనుకూలంగా పరిస్థితుల్ని వినియోగించుకోడానికి కుట్రలు పన్నుతున్నాయి. దొంగ సారాను అరికట్టలేమని ముఖ్యమంత్రులే సిగ్గు లేకుండా ప్రకటించుకోవటం, పరోక్షంగా దాన్ని ప్రోత్సహించటానికే. 'నిషేధం' సాకుతో బలహీనులపైనా, అమాయకులపైనా కేసులు పెట్టి వేధించటానికి రంగాన్ని సిద్ధం చేసుకుంటున్నారు. పాలకుల ఎత్తుల్ని చిత్తు చేసే నిలకడైన, నిజాయితీ గలిగిన నాయకత్వం యిప్పు డవసరం.

సారా వ్యాపారాన్ని ప్రభుత్వం నిర్వహించటాన్ని రద్దు చేసుకోవాలి. దొంగ సారా కాచే వారినీ, అమ్మే వారినీ శిక్షించే విధంగా చట్టాలు చేయాలి. ప్రజలు తాగడానికి అవకాశాలు లేకుండా చేయవలసిన బాధ్యత ప్రభుత్వాలే స్వీకరించాలి. అలాగే తన ప్రచార, ప్రసార సాధనాల ద్వారా, యంత్రాంగం ద్వారా తాగుడుని నిరుత్సాహపరిచే చర్యల్ని కూడా ప్రభుత్వం చేపట్టాలని డిమాండ్ చేయాలి. ప్రజల క్షేమం కోరే వ్యక్తులూ, సంస్థలూ తాగుడు దురలవాటు నుండి ప్రజల్ని నయానా, భయానా తప్పించేట్టు ప్రయత్నం చేయాలి. నీతిబాహ్యమైన ప్రభుత్వాలు, పాలకవర్గ స్వార్థపర శక్తులూ, వారి తొత్తులూ, అవినీతి జీవులూ, సారా వ్యాపారులూ సృష్టించే అనేకానేక అడ్డంకుల్ని పట్టుదలతో, దీక్షతో ప్రజలపై ముఖ్యంగా మహిళలపై ఆధారపడి ఎదిరించి నిలిస్తే గానీ అంతిమ విజయం మనకు చేకూరదు. తాగుడు యొక్క దుష్ఫలితాలను అర్థమయ్యేట్టు బోధ పరచటం, తాగిన వారికి సాంఘికంగా సహాయ నిరాకరణ చేయటం, వారిపై చైతన్యవంతమైన అదుపుని సాధించటం ప్రజా ఉద్యమ కర్తవ్యంగా ఉండాలి. తాగుబోతు అనిపించుకోవటమే అవమానకరమైన అంశంగా సమాజ సాంస్కృతిక స్థాయి అభివృద్ధి కావాలి. అంతిమంగా చట్టంతో కాని పని సంస్కారంతో జరిగేట్టు మార్పుని సాధించాలి.

సారా వ్యాపారాన్ని తక్షణమే నిషేధించాలి !

మద్యపానాన్ని నిరుత్సాహ పర్చాలి !!

సారా కాంట్రాక్టర్ల ఆస్తుల్ని జప్తు చెయ్యాలి !!!

ఆధునిక వీధి నాటకం :

# శబ్దం

—దివికుమార్

—ఉదయ్

## ఒక్క మాట!

ఈనాడు ఆంధ్ర ప్రదేశ్‌ని కుదిపి వేస్తున్న సారా వ్యతిరేకోద్యమంపై మేము ఈ నాటకాన్ని రూపొందించాము. గత 3, 4 సంవత్సరాలుగా సారాకు వ్యతిరేకంగా తెలంగాణా జిల్లాల్లో జరుగుతున్న ఆందోళనా, ఈ సంవత్సరం నెల్లూరు జిల్లా మహిళల్లో వచ్చిన కదలికల్ని అర్థం చేసుకుని ఈ సంవత్సరం వేలం పాటల సమయానికి నాటకం రూపొందించి ప్రదర్శనకు సిద్ధం చేయాలని మేము తలపోశాం. ఉద్యమ నిర్మాణ వత్తిళ్ళ మధ్య అనుకున్న సమయానికి రాత పని పూర్తి కాకున్నా సారా వేలం పాటల కాలానికి, సెప్టెంబరు 5వ తేదీకి రచనను పూర్తి చేశాం.

11-9-92 నాటి నెల్లూరు జిల్లా మహిళల మహా ప్రదర్శనా, సారా వేలం పాటల్ని వాయిదా వేయించిన ధర్నా, పికెటింగ్ వార్తలు మమ్మల్ని ఉత్తేజితుల్ని చేశాయి. మా బృందం సభ్యులు ఆరుగురు నెల్లూరు జిల్లా వెళ్ళిపోయి అక్కడి విద్యార్థుల్ని కొందర్ని తోడు చేసుకుని 20వ తేదీనుండి ప్రదర్శనలు ప్రారంభించాం. 8 మండలాల్లో 15 రోజుల్లో 18 ప్రదర్శన లిచ్చాం.

సెప్టెంబరు 26న నెల్లూరు జిల్లా వేలం పాటలు జరగనివ్వకుండా చేయటానికి బారికేడ్లను, పోలీసు వలయాలను ఛేదించుకుంటూ గోడలు దూకి సుబ్బారెడ్డి స్టేడియం లోకి మా బృందమంతా దూసుకు వెళ్ళింది. డప్పుల శబ్దాలతో, ఉత్తేజకరమైన పాటలతో సారా ఉద్యమకారుల పోరాట స్ఫూర్తిని నిలబెట్టాం. ఉద్యమ నాయకులు జిల్లా అధికారులతో చర్చిస్తున్న సమయంలో ఈ నాటకాన్ని ప్రజల మధ్య ప్రదర్శించాం. ప్రేక్షకుల (సారా వ్యతిరేకోద్యమ వాదులు) ప్రతిస్పందన మమ్మల్ని ఉత్తేజితుల్ని చేసింది.

మా ప్రదర్శనల్లో ఏ రెండు, మూడో తప్ప, మిగిలినవన్నీ ప్రయోజనాత్మకంగా ముగిశాయి. ప్రత్యేకించి దూబగుంట, శాయిపేట, చీకవోలు, రామతీర్థం, పాతూరు వారిళ ప్రదర్శనలు పేర్కొన వలసి వుంది. నాటకంలోని మాలకొండయ్య పాత్ర లాంటి వ్యక్తి తమ గ్రామంలో ఉన్నట్టు దాదాపు ప్రతిచోటా ప్రజలు చెప్పారు.

సెప్టెంబరు 28వ తేదీ ఉదయం 6 గం. నుండి 30వ తేదీ అర్ధరాత్రి వరకూ నెల్లూరు

జిల్లా వేలంపాటలు జరుగనివ్వకుండా మహిళలు, ప్రజానీకం కలిసి జరిపిన ఆందోళనకు ఊపునీ, ఉత్సాహాన్నీ యిస్తూ మేం అక్కడే వుండిపోయాం. ఉద్యమాన్ని పక్క దారి పట్టించే, నీరుగార్చే ప్రయత్నాలను మా కళారూపాల ద్వారా ఎదుర్కొన్నాం. అదొక ఉత్తేజపూరితమైన అనుభవమూ, అనుభూతీ! ఈ నాటక ప్రదర్శనానంతరం నటులు వెంటనే ప్రేక్షకులతో చర్చించటానికి అనువైన ముగింపు నిచ్చాం. ప్రేక్షకుల్ని ప్రదర్శనలో మునిగిపో నివ్వకుండా కథాగమనాన్ని చెడనివ్వకుండా, "బ్రెక్ట్రియన్ ఎలీనేషన్" దృక్పథపు వెలుగులో దీన్ని రూపొందించటానికి ప్రయత్నించాం. కోర్టు సీన్లని అందుకు వినియోగించుకుని పాలకుల వాదనల్నీ, కుట్రల్నీ బట్ట బయలు చేయటానికీ ప్రేక్షకుల్లో అంతర్మథనాన్నీ, భావ సంఘర్షణనీ కలిగించటాన్నీ చూశాం. ప్రదర్శన ముగిసిన వెంటనే ప్రేక్షకుల్లోకి వెళ్ళిపోయి చర్చించటం ద్వారా వారి తక్షణ కార్యాచరణ పథకాన్ని రూపకల్పన చేయటానికి అవకాశం తీసుకున్నాం.

ఉద్యమ నాటకం సాధించవలసిన అత్యుత్తమ ప్రయోజనం యిదేనని మేం అభిప్రాయపడుతున్నాం.

ఇక దీని యోగ్యతలను నిర్ణయించవలసిన బాధ్యత పాఠకుల, ప్రేక్షకుల, కళా విమర్శకుల పైనే వుంది. —రచయితలు ]

కోర్టు జవాను: సైలెన్స్ (గట్టిగా, నాటకం వైపుకి ప్రేక్షకులందరి దృష్టినాకర్షించేలా అనాలి.)

[పబ్లిక్ ప్రాసిక్యూటర్ పి.పి.), డిఫెన్స్ లాయరు(డి.లా.) నిలబడి జడ్జి కోసం ఎదురుచూస్తూ ఉంటారు.]

పి. పి. : డిఫెన్స్ లాయరుగారూ....జడ్జిగారు ఇంకా కోర్టుకి రాలేదే!

డి. లా : జడ్జిగారు రాకపోతే ఏవండీ?

పి. పి. : జడ్జిగారు లేకుండా కోర్టు ఎట్లా నడుస్తుందండీ?

డి. లా : ఈ రోజు మన కోర్టుకి ఈ ప్రేక్షకులే న్యాయనిర్ణేతలు. స్నేహితులారా... మీరు ప్రేక్షకులుగా కాకుండా జడ్జీల్లాగా వ్యవహరించాలి. ఇన్నాళ్ళూ ఏం జరిగినా ప్రేక్షకుల్లాగా మిగిలిపోతున్నారు. ఇకనుంచైనా మీరు అలా ఉండటానికి వీల్లేదు. అందుకే మీరు ఈ నాటకంలో జడ్జీల్లాగా ఉండాలి. మైడియర్ పబ్లిక్ ప్రాసిక్యూటర్, ఇక మొదలెడదామా?

కో. జ : సైలెన్స్....మాలకొండయ్య....మాలకొండయ్య....వరాలమ్మా....సత్యం మాస్టారూ....

పి. పి. : యువరానర్....వరాలమ్మ అనే ఈ మహిళ....ఆమె భర్త మాలకొండయ్య....సత్యం అనే ఎలిమెంటరీ స్కూల్ మాస్టారు- ఈ ముగ్గురు

(మిగతా 41 వ పేజీలో)

వ్యంగ్యం :

# అందరూ సారా తాగాల

బావా,

నా సారా యాపారానికి పెమాదం ముంచుకొచ్చిసినాది. పెకాశంజిల్లాలో, నెల్లూరుజిల్లాలో, సిత్తూరుజిల్లాలో.... ఎక్కడ సూసినా గుండె బెంబేలెత్తిపోతన్నాది. సంసారం పోయినా పర్నేదుగాని, సారా యాపారం బోతే నానేటి జేత్తాను? నా ఎన కున్న నువ్వేటి జేత్తావు? మావంతా జనాన్ని సారాలో ముంచబట్టే యిన్నాళ్ళు, యిన్నేళ్ళు నీపాలన సల్లగా సాగిపోనాది. కాని యిప్పుడు పది మంది ఆడకూతుళ్ళు కలిసి యింత ఇప్లవం సుట్టించేసినారుగందా-ఏ యిసయం మీదైనా 'పదిమంది కలిత్తే మన పని ఇంతే సంగతులు.' అంటే నీపని, నాపని కూడా గోవిందా! గోవింద! కదా!

సట్ట సబల్లో కూకుని నువ్వు నీ వందిమాగదులు మాటాడే మాటలు నాకేటి నచ్చనేదు.

"యీ పరిణామం మంచిదే" అంటా డొకడు.

"మద్యనిసేదం ఎమ్.ఎల్.ఏ.ల దగ్గర్నుండి మొదలవ్వాల" అంటా డింకొకడు.

"ఆదాయం సంగతి ఆలోసించ మంటాడు" మరొకడు.

యీళ్ళందరూ సేప్పేదేంది! సారా వద్దనేగా! ఈ సన్నాసి కబుర్లన్నీ ఒగ్గేయ మని సెప్పు. సారా యాపారమే నేకపోతే మనం గడ్డి తినాల. అసలు సారా యాపారమేగాదు,అన్ని యాపారాలు వరిదిల్లాల. ఇది పెజాసామ్యం అందరూ పిల్లాపాపలతో సల్లగుండాల. పెథిడిన్, నల్లమందు, గంజాయి, యబిచారం....లాంటి యాపారాల కంటె నా యాపారం గొప్పదేం కాదు. అయ్యన్నీ సల్లగసాగుతుండగ-సారా యాపారమే ఎందుకెత్తేయాల ?

సారా అమ్మకపోతే నాను సల్లగుండేదెల్లాగ ? నువ్వు లైసెన్సులు, కోటాలు, పర్మిట్లు జారీ సెయ్యకపోతే నువ్వు సల్లగుండేదెల్లాగ ? కులాలకొట్లాటలు, మతాల మారణఓమాలు నేకపోతే, మన ముఠాఓళ్ళు బతికేదెల్లాగ? లంచాలు తీసుకోకపోతే, ఆపీసర్లు బతికే దెల్లాగ? కల్తీసరుకమ్మకపోతే, యాపారులు బాగుపడే దెల్లాగ? మనందరం బతక్కపోతే పెజాసోమ్యం బతికే దెల్లాగ ?

అందుచేత, బావా! నువ్వెంటనే అందరూ సారా తాగాలని సట్టం జెయ్యాల. అసలు 'మందు' కొట్టకపోతే మన ఆపీసర్లే పని జెయ్యరు. మొన్న పుష్కరాల్లో జూడు- నువ్వు సారా అమ్మ నివ్వ నేదు. బయంతోనో, బత్తితోనో పాపం, జనం తాగనేదుగాని- మన పోలీసు దొర మాతరం ఊరుకో నేకపోన్నాడు. మందు కొట్టేసి ఆడ గుంటల్ని అల్లరి బెట్టేసిండు. ఈడి పని కంచే సేను మేసినట్టుంది. ఎవుడూ అల్లరి సెయ్యకుండా సూడమని యీడికి డూటీ ఎత్తే, యీడే పీకాలదాకా పీపాలు పీపాలు తాగి, అమాంతం 'అల్లరిసేసే' అవతారం ఎత్తిండు. మరి గందుసేత, బావా!

అందరూ తాగాలని రూలు సేత్తే- మన మునావోళ్ళు తాగినా 'నలుగురితోపాటు నారాయణ' అంటారు గాబట్టి, నీ అబోరన్నా దక్కుద్ది. నేకపోతే నీ సీటు బీకి సాపేసుకుంటారు. దేశంలోని 'సారా'అంతా యీళ్ళే తాగేసి దేశంలో జరిగే 'మంచి' పనులన్ని యీళ్ళే జేసేత్తారు. ఆ తరవాత పీక్కోనేక నువ్వు జావాలి.

అయినా యీ ఆడ కూతుళ్ళకీ యిదేం పని! మొగుళ్ళు తాగితే 'అమెరికను యీరో'నాగ ఉన్నాడని పొంగిపోక, ఎదురు తిలగటమేంటి? అసలీళ్ళు మొగుడి నెదిరించి 'ఇందూ దరమానికే' పెమాదం దెచ్చిర్రు. ఈళ్ళనిలా ఒగ్గేత్తే, నాబంనేదు. యియ్యాల యిదన్నారు- రేపు యింకోటంటారు. 'క్లబ్బుల కెల్లొద్దు పేకాడొద్దు' అంటారు. 'యబిచారం సెయ్యొద్దు- పేద గుంటల్ని పాడు సెయ్యొద్దు' అంటారు. యీళ్ళ మాటలన్నీ యింటూ గూకోవడానికి మనమేం సెవిలో పువ్వెట్టుకోనేదు. ఇది మొగోళ్ళ రాజ్జెం. ఆడ మలయాలం కాదు. ఏమయినా సరే, ఏదోరకంగా మొగుడు సెప్పుసేతల్లో పెళ్ళాలుండాల. అందుకేదన్నా మారగం ఆలోసిచ్చాల. మన పెద్దోళ్ళేనయం. 'పెళ్ళాన్ని రంబ' అన్నారు. అదే నోటితో 'మాత' అన్నారు. 'మంత్రి' అన్నారు. యింకా సానా సానా అని ఆళ్ళని ఉబ్బేసి, పనులు జరిపిచ్చుకున్నారు. మరి మన కాపాటి తెలివి నేకపోనాది. ఏదో ఒక 'కుళ్ళుప్లాను' ఆలోసిచ్చండి. ఆడోళ్ళకి పట్టు సీరలు పంచండి. నక్లెసులు సేయిచ్చండి. గ్యాసు స్టౌలు, కుక్కర్లు పంచేయండి. ఏటన్నా సెయ్యండి-ఆడోళ్ళు మాతరం సారా ఎతిరేక ఉద్దెమం మానుకోవాల. ఓరినాయనో! యీలెక్కన ఆళ్ళు సెలరేగిపోతే యింకేటన్నా ఉందా? మన బతుకులే రివర్సులో బడిపోతాయి. వంటింటిలో ఉంటేనే, ఆళ్ళదెబ్బకి ఆగనేక ఏనుగులాంటోడు, పీనుగయిపోతుండు. యిక యీళ్ళు బజార్లపడి 'ఉద్దెమాలు' నడిపితే నీపనీ, నాపనీ మనలాంటి గొప్పోళ్ళందరిపని గోయింద! గోయిందా! ఆడోళ్ళ దుష్టెప్పుడు నగలమీదికి, సినిమాలమీదికి, పట్టుసీరలమీదికి పోయేటట్టు సూడాలతప్ప, 'ఉద్దెమాల్లోకి' రాకూడదు. మంచి సెడులు గురించి ఆలోసించి, మంచిని నిలబెట్టాలని ఆళ్ళనుకుంటే, అపరకాళీ అవతారాలెత్తేసి, పది రోజుల్లో పెపంచం హోల్మొత్తాన్ని మార్చేయగల్రు.

బావా! తొరగా మేలుకుని నువ్వు 'అందరూ సారా తాగాల'ని సట్టం జేసెయ్యి. ఎదురు తిరిగినోళ్ళని- ఆడకూతుళ్ళని సూడకుండా కూడా లాఠీసార్జి జేసేత్తాం. ఊసకోత కోసి పారేత్తాం. మేము అంతటి మొనగాళ్ళమని నీకు తెల్సుగదా! దీంట్లో నువ్వు సిగ్గు పడాల్సిందేవీనేదు. అన్నిటికి ఆ 'గాంది'గారే ఉన్నాడు. ఏదో ఒకరోజున రాజఘాట్ కెల్లి గాందీగారి సమాదిమీద పడి, సెమించేయమని అడిగేద్దాం. అంతేగాని సారాని మాతరం నిసేదించకు.

ఉంటాను

నీ బావమ్మరిది

కత్తుల కాంతయ్య

# సారా పాల నింక సాగదు

అంబేద్కర్

సద్ది బొద్ది కట్టుకోని, సద్ది మూటలు ఎత్తుకోని
సారా పాటలు ఆపనీకి దండులాగా కదిలొస్తే

సారా పాటలు ఆపలేదన్నా ఓ యన్నలారా
సార పాలన ఆగలేదన్నా మా యక్కలారా ॥సద్ది॥

కూలి నాలి చేసెటోల్లం, కష్టపడి బతికేటోల్లం
పల్లె పల్లె కదలి వచ్చె, పల్లెలకు సార వద్దని
బతిమిలాడాం, భంగ పడినం

అర్జిలెన్నో యిచ్చుకున్నం
మాట పట్టని, గోడు చూడని
గొడ్డుమోతు ప్రభువులేలే
పాలనింకా సాగరాదని ॥ఓ యన్నలారా॥
ప్రతినబూని పోరుతున్నాం ॥మాయక్కలారా॥

సార తాగితే చాన చేటని - గాంధి తాత చెప్పేనంట
గాంధి తాత కథలు చెప్పి - గారడీలు చేస్తూ వుంటే
పెద్ద ఎత్తున పెట్టుకోని - పాటలిప్పుడు జరపడానిక్కి
కుట్ర లెన్నో సాగుతున్నాయి - కోటి ఎత్తులు వేస్తున్నరు
ఆటలింకా సాగదాని - పాటలిక్కడ జరగ వాని

పందెమేసి వచ్చినామన్నా - ఓ యన్నలారా
పోరు బాటను విడవ బోమన్నా మా అక్కలారా ॥సద్ది॥

# "సారా" జైం

కథ

కాట్రగడ్డ దయానంద్

## 1

వరమ్మ కూతుర్ని కేకేసింది. ఆ పిల్ల ఎక్కడుందో గాని బదులు పలకలేదు. మళ్ళీ మూడోసారి బియ్యంలో నీళ్ళు పోసి పిసికి పిసికి కడిగి, కుడితి కుండలో నీళ్ళు వంచి పోద్దామని, బయటికొచ్చింది. చీకటి ముసురుకుని చాలాసేపైంది. పౌర్ణమి వెళ్ళిన మూడో రోజేమో చంద్రుడు ఎర్రటి నిప్పు ముద్దలా తూర్పున పొడుస్తున్నాడు.

"ఏం బియ్యమో! ఏమో! ఎన్నిసార్లు కడిగినా ముక్కవాసన పోతేకదా!" అని గొణుక్కుని "లక్ష్మి" అని కేకేసింది వరమ్మ.

ఆ ఇంటికి కాస్త దూరంగా ఉన్న చింత చెట్టు కింద పిల్లలు ఆడుకుంటున్నట్లు, ఆమెకు లీలగా కనపడింది.

"ఒసేయ్! లచ్చీ" అని ఇందాకటి కంటె గట్టిగా కేకేసింది వరమ్మ. "ఆఁ ఆఁ, వస్తున్నానమ్మా" అంటూ ఏడేళ్ళ లక్ష్మి, సంకలో మూడేళ్ళ పిల్లోడ్ని వేసుకుని నడవలేక నడుస్తున్నట్లుగా పరుగెత్తుకొచ్చింది.

"ఏందే జెష్టముండా! ఏడ సచ్చావే? ఎన్నిసార్లు పిలిచినా పలకవు!" అంటూ తిట్టింది వరమ్మ. లక్ష్మి మూతి నల్లగా పెట్టుకుని తల్లి కెదురుగా నుంచుంది. "లోపలికి చావు" అంది వరమ్మ.

పిల్లోడ్ని బయట మంచమ్మీద పడుకోబెట్టి, లోపలి కెళ్ళింది లక్ష్మి. వరమ్మ పక్కింటికెళ్ళి చిన్న గుడ్డ పీలికలో నిప్పురవ్వ వేసుకుని దాన్నిచుట్టి ఊదుకుంటూ, ఇంటిలోకి వచ్చింది.

"ఇంకా ఉగాదన్నా రాలేదు. అప్పుడే ఈ ఎత్తుమారపు గాలేందో? బయట పొయ్యి ఎలిగిద్దామంటే గాలికి మండి చావదు. ఇంట్లోనేమో పొగచుట్టుకుని మండి చావదు" అంటూ పొయ్యిలో కాస్త దుగ్గు వేసి నిప్పుగుడ్డను ఊది ఆ దుగ్గు కింద పెట్టింది. ఆమె ఎంత ఊదినా పొగ చుట్టుకుంటుందే గాని, మండటం లేదు. ఆఖరుకు ఊపిరి బిగబట్టి చాలాసేపు ఊదినాక, భగ్గుమని సుర సురా అంటుకుంది. ఆ దుగ్గు మీద గబగబా పత్తికంప విరిచిపెట్టి పుల్లలు అంటుకున్నాక, అన్నం గిన్నె పెట్టింది.

చీకటిగా ఉన్న ఆ ఇంట్లో కాస్త వచ్చిరాని వెలుగు చిమ్మింది.

"ఆ బుడ్డి ఇటు తేవే!" అంది.

గోడ మూలన చిమ్మి మీద పెట్టి ఉన్న గ్లాసులేని బుడ్డి తెచ్చి తల్లికిచ్చింది లక్ష్మి. ఒక మండుతున్న పుల్లతో బుడ్డి వెలిగించింది.

ఆ ఇంటిలోకి పూర్తిగా వెలుగు వచ్చింది.

ఒంటి దూలం తాటాకు గుడిసె అది. ఇంట్లో ఒక పక్కన ఒక ఉప్పు కుండా, దాని పక్కన మంచినీళ్ళది మట్టి బుంగా ఉన్నాయి. ఒక పాస్పేటు తెల్లసంచీలో

ఖియ్యమున్నాయి. పడమట పక్కన తాళ్ళతో కట్టిన ఒక వెదురు బొంగు దండెంలా కట్టి ఉంది. దానిపైన ఉతికిన గుడ్డలూ, కప్పుకునే దుప్పట్లూ చిందర వందరగా ఉన్నాయి. ఆ దండెం కింద పెద్ద చెక్కపెట్టె ఉంది. అందులోనే పప్పులూ, చింతపండూ, పొద్దుట మిగిలిన అన్నం కూరల గిన్నెలూ ఉన్నాయి. తూరుప్పక్క దక్షిణం మూలన పొయ్యి మండుతోంది.

వరమ్మ పొయ్యి ముందు నుండి లేచి, పెట్టె మూత తీసి, అందులో నుంచి రెండు రూపాయల కాగితం తీసింది. తన వైపే చూస్తూ నుంచున్న కూతురు దగ్గర కెళ్ళి, "నీ కెన్నిసార్లు చెప్పాలే- నేను పనిలో నుండి వచ్చేసరికి కాస్త కసువు చిమ్మి, దీపం పెట్టి, ఇంటి దగ్గరే చావమని! రేపట్నించి నేనొచ్చేలకి ఇంటికాడ లేకపోయేవో....ఇదుగో....ఒక పావలా బెల్లం, అర్ధరూపాయి మిరప ఒరుగూ, పావలాకి తెల్ల గెడ్డలూ, అర్ధరూపాయికి ఎఱ్ఱగెడ్డలూ, పది పైసలకు తమలపాకులు తొందరగా తీసుకునిరా పో!" అని రెండు రూపాయలు కూతురి చేతికిచ్చి, "దోవలో మళ్ళీ పెత్తనాలు చేయబాక" అని హెచ్చరించింది.

లక్ష్మి 'వెల్దునా....వద్దా' అని తటపటాయిస్తోంది.

వరమ్మ తను చెప్పినవన్నీ ఒకసారి లెక్కలుగట్టి, "నువ్వో పది పైసలకు కొనుక్కోని, వాడికో పది పైసలకు కొనుక్కురా!" అంది మళ్ళీ.

లక్ష్మి హుషారుగా బయటకు పరుగు తీసింది. బయట పిల్లోడు, 'నేనూ వస్తా' నంటూ ఏడుస్తున్నాడు. వాడినీ సంకనేసుకుంది లక్ష్మి.

వరమ్మ బయటికొచ్చి "వాడితోటి అయ్యన్నీ ఎట్లా తెస్తావే?" అంది.

"తెస్తాలే" అనుకుంటూ వెళ్ళిపోయింది లక్ష్మి.

తూలుకుంటూ లక్ష్మి కెదురొచ్చేడు శీనయ్య "ఎక్కడికే లచ్చీ" అంటూ.

"కోమటింటికిలే నాయినా!" అంటూ ఆ పిల్ల వెళ్ళిపోయింది.

శీనయ్య ఇంటి బయట మంచమ్మీదే వాలిపోయేడు. వరమ్మ ఒకసారి భర్తను చూచి మళ్ళీ పనిలో దిగబడి పోయింది.

"ఏందే అట్టా చూస్తావ్! నా ముఖా నేమన్నా బొమ్మలాడతన్నయ్యా! సందేల దాకా ఇద్దరం కల్సి ఒకచోటే పని చేసేం కదే!" అన్నాడు శీనయ్య కుశాలగా. వరమ్మ మళ్ళీ ఒకసారి చూచి, "రోజూ ఉండే సంబడమే కదంటలే"అనుకుంటూ లోపలి కెళ్ళింది.

"మీ బావ వచ్చినాడు ఊర్నించి!" అన్నాడు శీనయ్య.

"నీ సంబడం చూస్తంటే తెలుస్తానే ఉంది. మన డబ్బులైతేనేమో రెండు సంచులూ, ఊరక వస్తేనేమో నాలుగు సంచులూ కదా!" అంది వరమ్మ.

"ఊరుకోవే.... నియ్యమ్మా !.... ఇంటికి రావడం అలిసెం మొదలుపెడ

గ్రామాలకు సారా పంపడం నిలిపివేయాలి!

తావ్!" అన్నాడు శీనయ్య చికాగ్గా.

"మొన్ననేగా పోయింది. ఇంతలోనే ఏమొచ్చిందని దిగేడు?" అంది.

"పదిమంది కూలోల్లు కావాలని వచ్చేడు. అదీగాక పెళ్ళాం పిల్లలూ ఈడ్నే ఉన్నారు కదా! తీసకపోదామని వచ్చినట్టుంది" అన్నాడు.

"ఏ ఊరు? ఎన్నాళ్ళ పని?"

"దక్షిదిన నాయుడు పేట అవతల్లే. ఎకరా వరి కోసి, మోపులు కడితే మూడొందల దెబ్బయ్యంట. రేసను బియ్యం ఇత్తారంట ఆ రేటుకే. మన ఈరారెడ్డి బాబు, వెంకటేశ్వర్లు, నాగేశ్వ్రరావు, పెద్దనాయన వస్తామని ఒప్పుకున్నారంట. నన్నూ అడిగేరు. సరే నన్నాను." చెప్పేడు శీనయ్య.

"ఇంకేం, పోయిరా!" అంది వరమ్మ.

"అదేందే! నీకేమొచ్చింది?"

"ఎవుర్నడిగి 'సరేనన్నావు?' నీకేం, నువ్వు మారాజువు. 'సరే' నంటావు. కాంట్రాక్టు మాట్లాడుకున్నప్పుడల్లా పొద్దంతా మీ మగోళ్ళతోటి సమానంగా సచ్చీ చెడీ చేసి, రేత్రిల్లు అన్నాలు వార్చేసరికి, సచ్చి దుగ్గయ్యేది ఎవురు? నువ్వు పని చేసొచ్చి కమ్మంగా కాస్త తాగి పడుకుని, పద్యాలు రాగాలు తీస్తంటావు. నీ సొమ్మేం పోయిందని? ఒప్పుకునే వచ్చేవుగా" అంది వరమ్మ కోపంగా.

"ఏందో, నువ్వనేది నాకర్థం కావడంలా! ఎట్టనో కట్టపడి పని చేసుకోపోతే ఎట్ట? నెల్రోజుల పని. కాసిని డబ్బులు ఎనకేసుకుంటేనే కదా, ముసిలోడి దినానికైన అప్పు తీర్చుకునేది. నా మాటిను" అన్నాడు శీనయ్య.

"ఆc!.... బుంగలు బుంగలు తాగుతుంటే అప్పు తీరుద్ది" అంది వరమ్మ. వాడు మళ్ళీ మాట్లాడక పోయేసరికి ఆమె కాస్త మెత్తబడింది.

"నువ్వు నెల్రోజులూ తాగనని మాటిస్తానంటే నేనొస్తా!" అంది మళ్ళీ. "సర్లె! సర్లె!" అంటూ అటు తిరిగి పడుకున్నాడు శీనయ్య.

వరమ్మ లోపలికెళ్ళి, ఉడికిన అన్నం గిన్నెను మసిగుడ్డతో పట్టుకుని, బయట కుడితి తొట్టి మీదుంచి, గెంజి వంచింది.

కోమటింటికి పోయిన లక్ష్మి తిరిగొచ్చింది. ఆ పిల్లతో పాటు వచ్చిన ఇంకో పిల్ల లక్ష్మి తమ్ముడ్ని ఎత్తుకుంది. ఆ పిల్ల నోట్లో కోమటింటి కొసరు బెల్లం కరుగుతుంది.

"సరే! మీ బావకు పైనం చెప్పొస్తా!" అని మంచమ్మీంచి లేచేడు శీనయ్య.

"ఇంకా అడ సారా కొట్లోనే కూలబడ్డాడా? పొద్దుబోకుండా రా! చింతకాయ పచ్చడి తొక్కుతున్నా! తొందరగా వచ్చి తింటే రేపటికి సామాను కట్టుకోవాల" అంది వరమ్మ.

"ఆc! ఆc!" అంటూ వెళ్ళేడు శీనయ్య.

మరసటి రోజు మధ్యాన్నానికి అన్నీ సర్దుకుంది వరమ్మ. గుడ్డలు మూట కట్టింది. ఇంట్లో మిగిలిన కాయా కసరు, దేనికవే చిన్న చిన్న మూటలు చేసింది.

చిన్న చిన్న రేకు దబరాలు కావల్సిన వరకే తీసింది. అన్నీ ఇనప్పెట్టెలో సర్దింది. ఎప్పుడో తన అయ్య పెళ్ళికి సదివించిన ఇనప్పెట్టె. ఆమె వస్తూ వస్తూ తెచ్చిన మిగిలిన సామానంతా ఎటో కొట్టుకు పోయేయి.

ఆమె వచ్చేనాటికి, ఆ ఇంట్లో అత్తా, మామ, మొగుడూ ఉండేవాళ్ళు. రెండెకరాల సవుడు భూముండేది. ముగ్గురూ కష్టపడే వాళ్ళే. ఆమె కూడా వాళ్ళతో పాటు కూలి కెళ్ళేది. నలుగురి సంపాదనలో తినగా మిగిలిందంతా, రాత్రేలకు మగోళ్ళిద్దరి సారా కొట్టుకు సరి.

మామకు చెప్పలేక పోయినా, ఆమె మొగుడికి నచ్చచెప్పబోయింది. మొదట్లో వాడు నవ్వి ఊరుకునేవాడు. తర్వాత్తర్వాత కసురుకునేవాడు. కొద్ది రోజులు పోయింతర్వాత "ఏందే నీ పెత్తనం? కష్టపడుతున్నా, తాగుతున్నా! మద్యలో నీదేంది గోల?" అని తిట్టేవాడు. కొన్నాళ్ళకు ఆమె వీపును చిట్లకొట్టడం కూడా అలవాటు చేసుకున్నాడు.

ఆమె తన ప్రయత్నం మానుకోలేదు. కొన్నిరోజులు మొగుడితో మాట్లాడటం మానుకుంది. వాడికేం నష్టం! వేళకు తిండి, సారానీళ్ళు దొరికేటప్పుడు! రాత్రయితే మెల్లిగా ఆమె పక్కలో చేరేవాడు. ఆమె వాడ్ని నెట్టేది. మోకాళ్ళతో తన్నేది. దగ్గరకు రానీకుండా అడ్డగించేది. సారా మత్తులో శీనయ్య ఆదో సరసంగా భావించేవాడు. ఆమెను బలవంతంగా ఆక్రమించుకుని తృప్తిగా లేచి పోయేవాడు. ఆమె తెల్లవార్లూ వెక్కి వెక్కి ఏడ్చేది. వాడిని తిట్టేది. వాడికి కట్టబెట్టినందుకు తన తండ్రిని తిట్టేది.

అత్త పోయింది. తర్వాత మామ పోయేడు. వాళ్ళ సావుకనీ, దినాలకనీ, సారా సంచులకనీ మెడలో పుట్టింటోల్లిచ్చిన రెండుపేటల గొలుసు పోయింది. ఇంట్లోని చెంబూ, తప్పేలా వరమ్మకు తెలీకుండానే మాయమయ్యాయి. ఇప్పుడు నాలుగువేలు అప్పు మిగిలింది.

చిన్నగా నిట్టూర్చింది వరమ్మ.

శీనయ్య రిక్షా తెచ్చేడు. ఇద్దరూ కల్సి ట్రంకుపెట్టెను పట్టుకెళ్ళి రిక్షాలోఉంచేరు. వరమ్మ ఇంటి పక్కవాళ్ళకు ఇల్లు సూస్తుండమని చెప్పి, వచ్చిరిక్షా ఎక్కింది.

లక్ష్మి స్నేహితులందరూ రిక్షా చుట్టూ మూగేరు. వాళ్ళతో ఏమీ చెప్పకుండానే రిక్షా ఎక్కి వాళ్ళవైపు నవ్వు మొహంతో చూచింది లక్ష్మి.

రైల్వే స్టేషన్‌కు చేరేరు. మిగతా నాలుగు కుటుంబాల వారూ అప్పటికే అక్కడున్నారు. ఆగి ఉన్న మద్రాసు బండిలో కాస్త ఖాళీగాఉన్న పెట్టె ఎక్కి సామాను సర్దుకున్నారు అంతా. ఆడోళ్ళనీ, పిల్లల్నీ పెట్టెలో కూర్చోబెట్టి, మగోళ్ళందరూ కిందికి దిగేరు.

వీళ్ళందరూ మరీ దగ్గరోల్లు కాకపోయినా, మొత్తానికి బంధుత్వం ఉంది వీళ్ళకు. ఎటున్నా కాంట్రాక్టు పన్లకు వెళ్ళేటప్పుడు కలిసే వెలతారు. తెలిసిన

★ సారా వ్యతిరేక పోరాటం వర్ధిల్లాలి!

వాళ్ళు ఒకరి కొకరు అయినవాళ్ళు కావడం వలన, ఆడవాళ్ళు మాటల్లో పడిపోయేరు.

బండి కదలడానికి ఇంకా టైముంది. టిక్కెట్లు తెస్తామంటూ మగోళ్ళు బయల్దేరేరు.

ప్లాట్ ఫారమ్మీద కాసేపు నడిచేక వరమ్మ బావ శేషయ్య వాళ్ళను ఆపి అన్నాడు.

"నేను అడ్వాన్సుగా రైతుకాడి నుంచి తెచ్చిన డబ్బులున్నాయిగాని, ఈరారెడ్డి పెదనాయినా! టికేట్లు తీసుకోవాలంటావా? రేత్రి బండికదే! టికేటు చెకింగు ఎవుడొస్తాడే॥" అన్నాడు.

"వస్తే. కష్టం కదరా! పిల్లాజెల్లతోటి పోతుంటుమి?" అన్నాడు ఈరారెడ్డి.

"బలేవోడివే బావా! వాళ్ళకింట్లో పెళ్ళాం పిల్లలూ ఉండరా ఏంది? ఈ బండి నాయుడిపేట చేరేతలికి ఏ రెండో మూడో అయిద్ది. ఆ రాత్రపుడు టికెట్లు ఎవడడుగుతాడు" శీనయ్య కూడా అన్నాడు.

వెంకటేశ్వర్లు కూడా "అది నిజమే" నని ఒప్పుకున్నాడు. మనిషికి చీరాల నుంచి నాయుడిపేటకు ముప్పై రూపాయల చార్జి. టికెట్లు తీయకపోతే ఒక్కొక్కరికి వందరూపాయలు మిగిలినట్లే.

వెంకటేశ్వర్లు తండ్రి ఈరారెడ్డి పేరుకు రెడ్డేగాని, సెంటు భూమిలేదు వాళ్ళకు. ఏ రోజుకారోజు కూలి చేసుకుంటేనే, అయిదువేళ్ళూ నోట్లోకిపోయే బతుకులు. లేకపోతే పస్తులు పడుకోవాల్సిందే. రెడ్డి అంటే పేరు డాబుసరిగా ఉంటుందని అందరూ పేరు వెనకగల "రెడ్డి"తోకను కత్తిరించినవాళ్ళే. ఈరారెడ్డి మాత్రం తండ్రి పెట్టిన పేరును ఆయనమీద గౌరవంతో అలాగే కాపాడు కొస్తున్నాడు.

ఈరారెడ్డి కెందుకో టికెట్లు లేకుండా ప్రయాణించడానికి భయమేసింది. 'ఐనా వీళ్ళందరూ ఉన్నారుకదా!' అనుకున్నాడు "సరేరా! మీ ఇష్టం" అన్నాడాయన.

శేషయ్య మళ్ళీ సన్నగా నవ్వి "అయితే బయటదాకా పోయి వద్దాం" అన్నాడు.

"బండి టైము పెద్దగాలేదు. తొందరగా రావాలి. పదపద" అంటూ తొందర చేసేడు శీనయ్య.

"మీరు పోయిరాండిరా! నేను ఆడోళ్ళకాడ తోడు కూకుంటాను" అని వెనక్కి తిరిగేడు ఈరారెడ్డి.

ఆ తర్వాత కాసేపటికి శీనయ్య, శేషయ్య, వెంకటేశ్వర్లు, నాగేశ్వర్రావు వచ్చి చేరేరు.

నాలుగు గంటలకు బయల్దేరాల్సిన బండి ఒక గంట ఆలిసెంగా బయల్దేరింది.

వాళ్ళు ఆ ఊళ్ళో బస్సుదిగి పెట్టెల్నీ పిల్లల్నీ జాగ్రత్తగా చూసుకున్నారు. వాళ్ళు దిగిన బస్సుస్టాండు కెదురుగా ఒక పోలీసుస్టేషనుంది. అక్కడక్కడా రెండు మూడు గుడిసెల్లో టీ అంగళ్ళున్నాయి. రోడ్డుకు దక్షిణంగా రెండు ఫర్లాంగుల దూరంగా ఊరు కనబడుతోంది. గాల్లోకి పొడుచుకొచ్చిన మిద్దెలు పైకిలేచి అంద

ముగా ఉన్నాయి. వాటి అందానికీ నేనే కారణమంటూ పకపక నవ్వుతూ ఇసుక మేటలు వేసి రోడ్డుకు ఉత్తరాన, స్వర్ణముఖి నది పారుతోంది. ఊరిచుట్టూ కర్ర తుమ్మ చెట్లు ఆవరించుకున్నాయి.

"ఎవుళ్ళింటికయ్యా" అంటూ ఒక ముసలతను వచ్చేడు. "పెద్దిరెడ్డి ఇంటికి" శేషయ్య బదులు చెప్పేడు కాలి బాటన దూరమవుద్దని, దిగిన దగ్గర్నుంచి నేరుగా ఊళ్ళోకి చేలగట్ల మీద బాటకట్టేరు వాళ్లు.

శీనయ్యా, వరమ్మా, వెంకటేశ్వర్లూ, వాడి పెళ్ళామూ, ఈర్రెడ్డి అతని భార్యా, శేషయ్యా, అతని భార్య- వాళ్ళ పిల్లలూ ఒకరి తర్వాత ఒకరు నడుస్తున్నారు. నాగేశ్వర్రావు మాత్రం అందరికంటె వెనక నడుస్తున్నాడు. అతని కెవరూ లేరు. అతని పెళ్ళాం చాలా రోజుల క్రితమే ఎవడితోనో లేచిపోయింది. మళ్ళీ పెళ్ళి చేసుకోలేదతను.

అప్పటికే వరి కంకులు ముదిరి పంట గాలివాటుకు వాలింది. "అదేందిరా! ఇంకా ఆలిస్సెం చేస్తున్నారేంది ఈల్లు- కోతలు కొయ్యకుండా" అడిగేడు ఈర్రారెడ్డి.

"ఈ ఊళ్ళకెప్పుడు దచ్చినాన ఆరం బాకటి నుంచో లేకపోతే అరక్కోణం నుంచో అరవోల్లు కూలికి వస్తుండేవాళ్ళు ఈ ఏడు నాలుగు నెల్ల నుంచీ ఈడ సారా అమ్మొద్దని, ఆడోల్లు చానా చానా గొడవలు చేస్తున్నారు. పొద్దంతా అరవచాకిరీ చేసి రేత్రికి సారాబొట్టు పడకపోతే ఎట్టా? అందుకని వాళ్లు ఈడ ఆగకుండా చిత్తూరు, కడప జిల్లాలకు పోతున్నారు. ఈడేమో కూలోల్లు దొరక్కుండా ఉన్నారు" చెప్పేడు శేషయ్య.

"అట్టయితే ఈడ సారా దొరకదా?" ఆనందంగా తృప్తిగా అడిగింది వరమ్మ.

"ఎందుకు దొరకదు? ఈడకు రెండ్రూపాయిల దూరంలో కాశాస్తుంది. ఆడ నుంచి సాటుగా తెచ్చి అమ్ముతున్నారు. డబ్బులు కాస్త పెచ్చులాగుతున్నారు" చెప్పేడు శేషయ్య. శీనయ్య విజయ గర్వంతో వరమ్మను చూసాడు.

"ఇదే ఇల్లు" అన్నాడు శేషయ్య ఆగి.

"అదేందబ్బయ్యా! నిన్ననంగా తీసుకొస్తానని చెప్పిపోయి, ఇయ్యాల తీసుకవస్తివి. అక్కడేమో గింజలు రాలిపోతుండాయికదా పైనేమో ఆకాశం అదో మాదిరిగా సూస్తా, గుండెల్లో గుబులు పెంచుతుంది రెండ్రోజుల్నుంచి. సరె సరె! ఆ సాలలోకి దిగండి" హడావుడిగా వాళ్ళకు ఎదురొచ్చి చెప్పేడు పెద్దరెడ్డి.

"మనుషులకు ఎంత డిమాండుగుందో మీకేం తెలియటం లేదండీ, రెడ్డిగారూ! ఇంట్లో కూర్చుని మాటలు చెప్పినంత తేలికా ఏంది మనుషులు దొరకటం?" అన్నాడు శేషయ్య.

రెడ్డి ఏమీ మాట్లాడలేదు.

ఆడవాళ్ళు పెట్టెలు తీసి సర్దడంలో పడ్డారు.

"మాక్కాసిని కట్టెకసూరు చూపించి, కాస్త ఏదన్నా అంగట్లో చెప్పండి. మీ

నారీ హుంషార్‌తో తప్పదు సారా పరార్!

ఖాతాలో సామాను తెచ్చుకుంటాం. చివర్న లెక్కలు కట్టుకోవచ్చు" అన్నాడు నాగేశ్వరరావు.

"పొయ్యి కింద కంపకు మాగ్గూడా ఇబ్బందిగానే ఉందే! సరే! ఏదో ఒకటి చేద్దాంలే! ముందైతే మధ్యాన్నమన్నా పనిలోకెళ్ళేట్టు చూడండి" అన్నాడు పెద్దిరెడ్డి.

ఒక బస్తా రేషను బియ్యం తెప్పించేడు రెడ్డి. దాన్ని అందరూ సమానంగా భాగాలేసుకుని, పంచుకున్నారు. కొట్లో చింతపండూ, ఉల్లి గెడ్డా తెచ్చుకున్నారు. ఆడవాళ్ళు పొయ్యిలు రాజేయడంలో పడ్డారు.

"ఏం రెడ్డిగారూ! ఊళ్ళో మళ్ళీ ఏమన్నా గొడవలు అయ్యేయా?" అడిగేడు శేషయ్య.

"చెబుతాగాని ఇటురా! ఆ వామిలోంచి కాస్త గడ్డి తీసి గొడ్లకు కాస్త విదిలియ్యి అబ్బయ్యా!"అని, "నువ్వొెళ్ళిన రోజు రేత్రి సారా గుడిసె తగలెట్టేరు ఆడోళ్లు. పట్టుకుపోను పోలీసులొొస్తే, వాళ్ళను అడ్డగించేరు. ఆకరుకు సారా కాంట్రాక్టర్లు జీపు లేసుకుని వచ్చేరు. వాళ్ళు సారా అమ్ముకోనిస్తే ఊరికింత డబ్బిలిస్తామని ఆశ కూడా చూపెట్టేరు. ఇంకో నెల రోజుల్లో వాళ్ళ కాంట్రాక్టు అయిపోతుందనీ, మళ్ళీసారి వేలం పాడమనీ అప్పుడివరకు అమ్ముకోనియ్యమనీ, లేకపోతే వాళ్ళకు నష్టాలొస్తాయని బతిమాలుకున్నారు. ఈ ఆడజనానికి ఏడనుంచొచ్చిందో గాని, ఆ తెగింపు నాయాల్ది! ససేమిరా వీలుకాదన్నారు. మళ్ళీ సారా జీపు వచ్చినా, తగలబెట్టేస్తామని బెదిరించేరు. పల్లె జనానికి తోడు ఊళ్ళో ఆడముండలు కూడా తోడైనాయిరా!" అన్నాడు పెద్దరెడ్డి.

ఆడవాళ్ళు ఆ మాటలు వింటూ వంట ప్రయత్నంలో ఉన్నారు. ఆ మాటలు వింటూంటే వాళ్ళకూ సంతోషంగా ఉంది. వరమ్మకైతే ఆ మాటలు వీనుల విందుగా చెప్పనలవికాని ఆనందంగా ఉంది.

"ఈ సుంచు ముఖానికేంది, అంత బాధగా ఉంది. సారా అమ్ముకోనియ్యకపోతే వీడెందు కింత బాధపడుతన్నాడు" మెల్లిగా వరమ్మతో అంది శేషయ్య పెళ్ళాం ప్రమీల.

"వీడెక్కడో పందిరి గుంజలకు పని చెప్పే రకంలాగుందే" వరమ్మ కూడా మెల్లిగా అంది.

"మన దగ్గర కూడా సారా అమ్మనియ్యకపోతే బాగుందే! ఇప్పుడిన్నించైనా రెక్కల కష్టం మిగుల్చుకోవచ్చు" అంది వరమ్మ మళ్ళీ.

"అవునవును. సారా కోసం ఎంత డబ్బులు కాజేస్తున్నారు వీళ్ళు" అంది ప్రమీల.

మగవాళ్ళు ఊరు చూడను పోయినట్టుంది. లక్ష్మి పిల్లలందర్నీ వెంటేసుకుని ఆడుకుంటోంది.

ఊళ్ళల్లో పెద్ద రెడ్లకూ, నాయుళ్ళకూ ఈ సారా బంద్ వచ్చాక పన్లు జరగడమే కష్టంగా ఉంది. కూలోల్లు దొరకడమే కనాకష్టంగా ఉంది. ఎవుడైనా ఇవాళొచ్చిన కూలి, ఇవాలే తిని తాగితేనే

మళ్ళీ తెల్లారి పనిలోకి వస్తాడని వాళ్ళ అభిప్రాయం. సారా దొరకడం లేదని అరవోల్లు వలస రావడం మానేసేరు. కూలోడు డబ్బులు మిగుల్చుకోవడం మొదలుపెట్టాక రైతుల్ని మించిపోతాడని కూడా వాళ్ళకు భయంగా ఉంది. అందు కని పెద్ద రైతులందరూ సారాను ఎట్ట యినా ఊళ్ళో అమ్మించాలనే ప్రయత్నం లోనే ఉన్నారు. సారా కాంట్రాక్టర్లతో మంతనాలు జరుపుతూనే ఉన్నారు. ఎన్ని చేసినా ఈ ఉద్యమం జిల్లా అంతటా రోజు రోజుకూ విస్తరిస్తూనే ఉంది. ఒక ఊరా? ఒక పల్లెనా? కొన్నిచోట్ల హరిజన వాడల్లో గుడిసెలు తగలబెట్టించేరు కాంట్రాక్టరు మనుషులు. మరికొన్ని ఊళ్ళల్లో గూండాలతో కొట్టించేరు. ఇం కొన్ని ఊళ్ళల్లో పోలీసులే సారా కొట్లకు కాపలా ఉండి, అమ్మిస్తున్నారు. ఎంత చేసినా ఈ ఉద్యమం రోజు రోజుకూ తీవ్రమై రాష్ట్రాన్నే కాదు, దేశాన్నికూడా చుట్టబెట్టేలా వుంది.

మధ్యాన్నానికి, ఏదో ఇంత వండు కుని తిని, రెడ్డి దారి చూపుతూ ముందు నడుస్తుంటే, కూలోల్లు వెనక నడుస్తు న్నారు.

"ఇదిగో నబ్బయ్యా! ఇదే నాలుగెక రాల కయ్య. ముందు ఇది కానీండి" అన్నాడు పెద్దరెడ్డి.

అందరికంటె పెద్దవాడైన ఈరారెడ్డి ముందు చేలోకి దిగి, వినాయకుడికి దణ్ణం పెట్టి, కొడవలి ఎత్తి అకాశాన్ని చూచి కోత మొదలుపెట్టేడు. అందరూ తలా ఒక మునుము పట్టుకున్నారు.

దూరంగా ఆకాశాన ఒక తెల్లమబ్బు మెరుస్తోంది. ఒక బాతుల గుంపు కోసిన వరి చేలో కలియ తిరుగుతోంది.

ఈరారెడ్డి కోత కోసేవాడల్లా లేచి నుంచుని నడుములు సవరించుకుంటూ, "ఒరే శేషయ్యా! ఈ రెడ్డి నమ్మకస్తుడే నంటావా? చేను చూస్తుంటే అయిదెకరా లకు అటూ ఇటుగా ఉన్నట్టుంది. నాలు గెకరాలని చెప్పేడేందిరా?" అన్నాడు.

"నాకూ అదే అనుమానం గుందే!" అన్నాడు శీనయ్య.

"సరే! నలుగుర్నీ విచారిస్తే తెలుస్తుం దిలే" అన్నాడు శేషయ్య,చేనుని నాలుగు పక్కలా అనుమానంగా చూస్తూ.

"ఎవుర్నని ఇచారిస్తాము రా - ఊరు కాని ఊల్లో?" గొణుక్కున్నాడు నాగేశ్వ రావు.

కోత ఆపి సాయంత్రానికి ఊళ్లోకి బయల్దేరేటప్పుడు పెద్దరెడ్డి వచ్చేడు.

"ఏంది, ఈ పూటంతా కల్సి మీరు కోసింది ఇదేనా?" అడిగేడతను.

"ఆఁ" అన్నాడు చేనుని చూస్తూ నాగే శ్వరావు.

"ఇదేం ఇత్తనమండీ బాబూ! మా కల్లి అయితే ఇలాగుండదు. పట్టుకోబోతే గుప్పిట కందదు. జారిపోతుంది. మరీ పొట్టిగా పెరిగింది. పరపరా ఎంత కోసినా తరగడంలేదు" అంది వరమ్మ.

"ఇది అయ్యార్ టొంటీ లేమ్మా. ఇట్ట

సారా రాజ్యం పోవాలి-ప్రజారాజ్యం రావాలి!

కోస్తే పంట ఇంటికి చేరినట్టే. పూటకు అర ఎకరం గూడా కాకపోతే ఎట్టా? ఇదే అరవోల్లయితే ఈ సరికి లాగి అవతల పేద్దురు. సరేగాని, ఎంట్లు తోటి మోపులు కట్టి, అవతల చేలోకి చేర్చండి కోసిన కాడికి" అన్నాడు రెడ్డి.

అందరూ ముఖాలు చూసుకున్నారు.

"అవేందిరా శేషయ్యా! అవతల చేలోకి నాలుగెకరాలు దాటి ఎందుకు మోసుకెడతాము? ఈడనే మోపులు కట్టి ఒక పక్కనేస్తాము." నాగేశ్వర్రావు అన్నాడు.

"అబ్బెబ్బే! అట్ట కాదు. నా కళ్ళం అవతల చేలోనే ఎప్పుడూ పేసేది. ఈడ నుంచి మోపుల్ని ఆ కయ్యలోకి చేర్చాల్సిందే" అన్నాడు రెడ్డి.

అప్పటికే చీకట్లు ముసురుకుంటున్నాయి.

వరమ్మకు ఎప్పుడెప్పుడు ఇంటికి చేరుదామా అని ఉంది. రాత్రంతా ప్రయాణం అలసట, రాగానే వండుకుని, తిని కోతలకు దిగటం....

ఈ రెడ్డేమో ఎవరితోనో పోల్చి పని సరిగ్గా చెయ్యటం లేదనటం - వాళ్ళకు అనుమానంగా ఉంది. అరవ కూలోల్లయితే తెగ పని చేస్తారని వాళ్ళతో వీళ్ళను పోల్చటం - బాధగా ఉంది వాళ్ళకు. పక్కనే పెద్ద సంకటి ముద్ద పెట్టుకుని, కాస్సేపు కోత కోసి కాస్త సంకటి తిని, మళ్ళీ కోస్తూ తింటూ పొద్దంతా చాకిరీ చేస్తూనే ఉంటారంట వాళ్ళు. సారా సంచులు తెచ్చిస్తే, బాగా పని చేస్తారని అరవోల్లకు సారా తెచ్చిచ్చే సాంప్రదాయం కూడా ఇక్కడే ఉంది. సారా పోసి శ్రమను పీల్చి పిప్పిచేసి, వాడి ఖాతాలోనే సారా డబ్బులు రాసి పెడతారు. పగలంతా ఒళ్ళు విరగ్గొట్టుకుని చాకిరీ చేసినవాడు, రేత్రికి సారా తాగి నిద్రపోతేనే తెల్లారి మళ్ళీ చాకిరీ చెయ్యగలడని రైతుల నమ్మకం.

ఇక్కడి రైతులకు పన్లకొచ్చే హరిజనులైతే, పొద్దున్నే పనికొచ్చి, మధ్యాన్నం ఒంటిగంటకు మళ్ళీ చేనుగట్లు ఎక్కుతారు. వాళ్ళకు ఇరపై రూపాయల కూలీ ఇస్తారు. అందుకనే రెడ్లందరూ ఎక్కువగా వరి కోతలకు తక్కువవుతుందని కాంట్రాక్టులికే ఇస్తుంటారు. ఈసారి పరిస్థితులు తారుమారుగా ఉండటంతో వారు ఉత్తరాది నుంచి కూలోల్లను పన్లకు పిల్చుకుంటున్నారు.

"ఏంది మాట్టాడరు" అన్నాడు పెద్దరెడ్డి.

"మేము అవతలి చేలోకి మోపులు మొయ్యాలంటే, మావల్లకాదండీ! దానికి వేరే కూలి డబ్బులు కట్టిస్తే మోస్తాము. లేకుంటే మోపులు కట్టి ఇక్కడే కుప్పవేస్తాము" గట్టిగానే అన్నాడు శేషయ్య.

"అదేందబ్బయ్యా! అట్టంటావు. నువ్వు నాకేదో చాకిరీ ఊరికే చేస్తన్నట్టుగా మాట్టాడుతున్నావే! కాంట్రాక్టు మాట్టాడుకున్న దానికే ఇస్తాము కాని, ఒక్క పైసా ఎక్కువియ్యను. మీరు బలే పేచీకోరుల్లా ఉన్నారే" అన్నాడు.

"అదేంది రెడ్డిగారు! మీరట్టా మాట్టాడతారు. ఏ చేలో కోసిన పంట ఆ చేలో కుప్పవేస్తాంకాని, ఇంకో చేలోకి మొయ్య

మంటే మా వల్ల కాదు" ఖచ్చితంగా చెప్పేడు ఈరారెడ్డి.

అప్పటికే చీకటి పడింది.

"సర్లే బాబా! పొద్దు పోతుంది. రేపొద్దున మాట్లాడొచ్చు లేవే!" అన్నాడు శీనయ్య.

అందరూ ఊళ్లోకి బయల్దేరేరు.

ముందు ఆడవాళ్ళు హడావుడిగా నడుస్తుంటే వెనక మగవాళ్ళు తీరిగ్గా నడుస్తున్నారు.

"ఆదేంది ఆ రెడ్డి. వచ్చిన కాడినుంచి సూస్తన్నా మరీ విలువ లేకుండా మాట్టాడతాడు" అంది ప్రమీలమ్మ.

"మీకెందుకే ఆ ఇసయాలు" కసిరేడు

"ఈ కస్సు బుస్సులకేం తక్కువ లేదు. ముందు మాట్టాడుకునేటప్పుడు ఈ సంగతులు తెలీవు. నీ కసలు తెలివుంటే గదా" ఏమీ తగ్గకుండా ప్రమీల మాటకు మాట జవాబిచ్చింది.

"ఊర్కో అక్కా! గొడవెందుకులే" అంది వరమ్మ.

వాళ్ళు ఊళ్లో కొచ్చేసరికి ఆరుబయట నేలమీద పడి వరమ్మ చిన్నకొడుకు ఏడుస్తున్నాడు. ఎవరో లైటు వెలిగించేరు. ఏడుస్తున్న పిల్లవాడు గబగబా వరమ్మ ఒడిలోకి దూకేడు.

వెంకటేశ్వర్లు కొడుకు వాళ్ళమ్మతో లచ్చి మీద సాడీలు చెబుతున్నాడు.

"అమ్మా! ఆ లచ్చేమో మమ్మల్నందర్నీ ఈడ వదిలిపెట్టి, చేలల్లోకి పోయి, పరిగె ఏరుకొచ్చింధే. కొడితే, తప్పేడు పైనే అయినియ్యే ఒడ్లు. కోమటింటికి పోయి సెనగపప్పు, బెల్లమూ కొనుక్కొనొచ్చి, మాకు పెట్టకుండా తినిందే" అని చెబుతున్నాడు.

లచ్చి వాళ్ళమ్మవైపు భయం భయంగా చూసింది. వరమ్మ ఏమి అనకపోయేసరికి, లక్ష్మికి ధైర్యం వచ్చింది. వరమ్మ కొడుకును వదిలించుకుని పైకి లేచి, "వీడ్ని మీ అయ్య దగ్గరకు తీసుకుపోవే" అంది కూతురితో.

మగవాళ్ళందరూ ఎక్కడి వాళ్ళక్కడ సోలిపోయి పడుకున్నారు. ఆడవాళ్ళు వంటపనిలో పడ్డారు.

కాస్సేపటికి శేషయ్య బయట నుంచి వచ్చేడు. అందరూ ఒకచోట చేరేరు మగవాళ్ళు. "లక్ష్మి! వీడ్ని తీసుకెళ్ళు" అంటూ కూతుర్ని కేకేసేడు శీనయ్య. లక్ష్మి పిల్లవాడ్ని తీసుకెళ్ళింది.

శేషయ్య మెల్లిగా అన్నాడు.

"బాబా! అది అయిదెకరాలకు కొద్దిగా తగ్గుద్దంట. నేను ఊళ్ళో విచారించేను. ఎకరం తక్కువ చెబితే, మూడొందల డెబ్బై తగ్గుద్ది గదా అని ఈ రెడ్డి మనతో అబద్ధం చెప్పినట్టుంది. దీని సంగతి తేల్చుకోందే రేపు పనిలోకి పోవద్దు."

"అట్టనే గాని, మోపులు సంగతి కూడా తేల్చుకోవాల్రా" అన్నాడు నాగేశ్వర్రావు.

"అది గూడా అంతే! అవతలి చేలోకి మోసేట్టయితే, వేరే డబ్బులు ఇవ్వాల్సిందే!" అన్నాడు వెంకటేశ్వర్లు.

"మరీ ఈ రెడ్డి పిచ్చోల చెర్లో చేపలు పట్టే రకంలాగున్నాడ్రా! ఒప్పుకుంటాడా అని" శీనయ్య మెల్లిగా అన్నాడు.

"ఏమోరా! ఊరుకాని ఊరు. మనకేమో ఇక్కడ పద్ధతులు కొత్త. ఈ రెడ్డి చూస్తేనేమో అసాధ్యుడుగా ఉన్నాడు" భయపడుతూ అన్నాడు ఈరారెడ్డి.

శీనయ్య వరమ్మ ఎక్కడుందో చూసి మెల్లిగా అన్నాడు, "తెచ్చేవా అన్నా!" అంటూ.

"లేదురా! అటు కాళహస్తిలో కూడా దుకాణాలు మూసేయించినారంట. ఇన్నాళ్ళూ అక్కడ నుంచి దొంగ చాటుగా తెచ్చి ఈ ఊళ్లో అమ్మేవాళ్ళు. ఇప్పుడదీ కూడా మూతపడింది. జనం సారా దొరక్క గిజగిజ లాడుతున్నారు. ఈ ఆడోళ్ళేమో సారా దుకాణాలూ, సంచులూ తగలబెట్టడమే కాదు- ఈ పక్కూళ్లో సారా జీపుని కూడా తగలబెట్టేరంట. ఇటుపక్క ఊళ్ళన్నీ అల్లకల్లోలంగా ఉన్నాయి. ఇది దేశమంతా పాకుతుందని జెనమంతా చెప్పుకుంటున్నారు" చెప్పేడు శేషయ్య.

"ఈ రేత్రికి నిద్ర పట్టేదెట్టనో" గొణుక్కున్నారు వాళ్ళందరూ.

# 4

తెల్లారి కాసేపైంది!

అందరూ అన్నాలు తిని తీరిగ్గా కూర్చున్నారు. కుక్క ఒకటి పారబోసిన ఎంగిలి నీళ్ళను నేల మీద నాకుతోంది. కుక్క ఎప్పుడు వెళ్ళిపోతుందా అని, కాకి ఒకటి పైన మునగ చెట్టుమీద కాసుకుని కూర్చుంది. వెంకటేశ్వర్లు, శీనయ్య బీడీలు వెలిగించేరు. వీరారెడ్డీ, నాగేశ్వర్రావూ చుట్టలు చుట్టుకుంటున్నారు. ఆడవాళ్ళు పేలు చూసుకుంటుంటే, పిల్లలు మునగ చెట్టు కింద ఆటలాడుకుంటున్నారు.

పెద్దిరెడ్డి హడావుడిగా వచ్చేడు.

"లేవండి, లేవండి! ఏంది అట్టనే కూర్చున్నారు. ఇంకా అన్నాలు తినలేదా? అవతల బారెడు పొద్దెక్కితే" అన్నాడు.

"తిన్నాము, రెడ్డిగారూ! ఒక మాట మీతో మాట్లాడి పనిలోకి పోదామని" అన్నాడు శేషయ్య బీడీని ఒక దమ్ము లాగి.

"ఏందబ్బా మీరు నాతో మాట్లాడాల్సింది. కానీండి" అన్నాడు కంగారుగా.

"అబ్బే, ఏం లేదండి. నిన్న ఆ చేను నాలుగెకరాలన్నారు కదా! మా ఈరారెడ్డి పెద్దనాయన అది అయిదెకరాలుండుద్ది అంటున్నాడు. అనుమానమొచ్చినప్పుడు తేల్చుకోవాలి కదా" అన్నాడు శీనయ్య.

రెడ్డి కాసేపు తల గోక్కుని "నాలుగ్గాదులే, నాలుగున్నరెకరం" అన్నాడు నెమ్మదిగా.

అందరూ ఒకరొనొకరు చూసుకున్నారు.

వీళ్ళు పనిలోకి రాకపోయేసరికి రెడ్డికి భయం పట్టుకుంది. ఇప్పుడా కూలోల్లు దొరికే పరిస్థితి కాదు. వీళ్ళతో పేచీ పెట్టుకుంటే తనకే నష్టం అని రెడ్డి రాత్రంతా ఆలోచించి తీర్మానం చేసుకున్నాడు. అయినా ఒక అర ఎకరం తక్కువే చెప్పేడు.

"అయిదెకరాలకు తక్కువ ఉండదండీ" అన్నాడు నాగేశ్వర్రావు.

"అబ్బెబ్బే! నాలుగున్నరకు కాస్తంత హెచ్చుండుద్ది. అంతే" అన్నాడు రెడ్డి.

"సరే! అట్టనే గానియ్యండి"అన్నాడు వీరారెడ్డి ఒప్పుకున్నట్టుగా.

"వరి మోపులు సంగతేందండీ?" నిలేసేడు శీనయ్య.

"మీరు బలే పేచీగా కనబడతున్నారే! అన్నిటికీ పేచీలైతే ఎట్టయ్యా పని నడిచేది?" కోపంగా అన్నాడు పెద్ద రెడ్డి.

"అదేందండీ అట్ట మాట్టాడతావు. చాకిరీ చేస్తున్నాం. కూలి అడుగుతున్నాం. మాకేందో ఊరికే ఇస్తున్నట్టుగా మాట్టాడతావేంది?" వరమ్మ పేలు కుక్కటం ఆపి, కల్పించుకుంది.

ఆ మాటలకు రెడ్డి మొహం ఎర్రబడింది.

శీనయ్య వరమ్మను కసురుకున్నాడు. "నోర్మూసుకోవే! నువ్వేంది మధ్యలో" అన్నాడు శీనయ్య.

"అవును. నన్ను నోర్మూసుకోమంటావు. నోర్మూసుకుంటే మట్టికొట్టుకునిపోతాము. ఈడకొచ్చేటప్పుడే చెప్పేను కొత్తూరు, కొత్త దేశం అని. నువ్వు ఇన్నావా నా మాట. పొద్దంతా చాకిరీ చేస్తే, పాతిక గూడా గిట్టేట్టు లేదు. ఈ బాగ్గేనికి ఇంత దూరం రావాల్నా. ఆడనే జీడి తోటల్లోకి పనికి పొయ్యుంటే రోజుకు పదిహేను గిట్టేవి. ఈడ ఎకరం రెండు రోజులగ్గూడా అయేట్టు లేదు. కాసిని మజ్జిగ సుక్క గూడా దొరికే దేశం కాదిది. సూస్తంటే ఆయనేమో మనల్నే మోసగాళ్ళగా, మాట తప్పు డోల్లంగా, పేచీకోరులుగా చెబుతున్నాడు. అడిగిందాకా అయిదెకరాల భూమిని నాలుగెకరాలే అని చెప్పేడు. నువ్వేమో నా నోరు మూయించాలని చూస్తావు. నేనేమన్నా తప్పు మాట్టాడితే నీ ఎడం కాలి చెప్పుతో కొట్టు." లేచి సిగను ముడేసుకుంటూ వల్లమాలిన కోపంతో అంది వరమ్మ.

అందరూ నిశ్చేష్టులయ్యేరు.

ఆమె మాటలకు రెడ్డి మొహం కళ తప్పింది.

రెడ్డి మోపులు మోసినందుకు ఇంకో పది రూపాయలు అదనంగా ఇస్తానని ఒప్పుకున్నాడు. ఎకరానికి మూడొందల ఎనభై లెక్కన ఒప్పుకున్నారు. ఈ పది రూపాయల్ని ఏ లెక్కలో సరిచేయాల్నా లెక్కలు చూసుకునేటప్పుడు అన్న ఆలోచనలో పడ్డాడు పెద్దరెడ్డి.

అందరూ పై గుడ్డలు దులుపుకుని పనిలో కెళ్ళటానికి లేచేరు. ఎక్కడి నుంచో లీలగా అరుపులూ, గోలా విన వచ్చింది.

ముందు రెండు ట్రాక్టర్లు, ట్రాక్టర్లను నడుపుతూ కూడా ఆడవాళ్ళు, వెనక చాలామంది ఆడవాళ్ళు బ్యానర్లను పట్టుకుని, నినాదాలు చేస్తూ, నడుస్తున్నారు. వాళ్ళ వెనక రెండు లారీలు మెల్లిగా కదుల్తున్నాయి. పుట్ట పిగిలినట్లుగా ఆడ వాళ్ళు వీధుల్లో కొస్తున్నారు.

కొంపలు కూల్చే సారా మా కొద్దు!

"సారాయి అంగళ్ళు . మూసే యాలి!"

"సారా వేలం .... వెయ్యద్దు!"

"సారా మానండి .... ఆ రో గ్యం పొందండి!"

ఆ వీధి హోరెత్తి పోతుంది.

వరమ్మ వాళ్ళ వైపు ఆశ్చర్యంగా చూస్తోంది.

ఆమెకు తన జీవితమూ, తన రెండు పేటల గొలుసూ, రెండెకరాల సవుడు భూమీ, తను తిన్న దెబ్బలూ, తిట్లూ, తమ అప్పులూ, తన మొగుడూ .. అన్నీ సారా చుట్టే తిరుగుతున్నట్లుగా కనిపించేయి.

ఆమె కళ్ళవెంట నీళ్ళు తిరిగేయి.

"ఛూ, నియ్యమ్మా! ఈ దేశానికి పాడు గాలం దాపురించి నట్టుంది. ఈ సంసారపు నాకొడుకులు, సంసారపు ముండలు కూడా వాళ్ళతో నే కల్సిపోయేరు. నెల్లూర్లో మీటింగం టే ట్రాక్టర్లు కూడా ఇచ్చేరు. ఇంక ఊళ్ళల్లో పన్లు జరిగినట్టే." గొణుక్కుంటున్నాడు పెద్దరెడ్డి.

విడుదలయ్యాయి

కొనండి !

వినండి !

## 1. సారా సమరంలో

### - స్త్రీ విముక్తి స్వరాలు

( రూపకం )

C - 60 కేసెట్

## 2. సారా వ్యతిరేక పోరాట పాటలు

C - 60 కేసెట్

దొరుకుచోట్లు :

| | | |
|---|---|---|
| మణి బుక్ స్టాల్, | మైత్రీ బుక్ హౌస్, | 168, న్యూ ఎం.ఎల్.ఎ. |
| సండే మార్కెట్ | మసీదు వీధి | క్వార్టర్స్ |
| నెల్లూరు. | విజయవాడ. | బషీర్ బాగ్, హైదరాబాదు. |

# ఒక వేకువ కోసం....

**- ఛాయరాజ్**




ఈ ప్రపంచంలో అర్ధవంతమైన దేదైనా వుదంటే అది త్యాగమయ జీవితమొక్కటే, అందులోనూ విప్లవ త్యాగమయ జీవితమంత అత్యంత అర్ధవంతమూ,సౌందర్యమయమైనదేదీ మరి వుండదు. విప్లవ త్యాగధనుల జీవితాలు శాశ్వతం. అవి శ్రామిక జీవన పోరాటాలకు శక్తిని తాపే విప్లవ సౌందర్యామృత రాశులు. వారి స్మృతులు "మృత్యు రుతువులో నవజీవన పతాకాల శ్వాసను" ఎగరవేసి నూతన ప్రపంచ స్వప్నాలను ఆవిష్కరిస్తాయి. అమర వీరులకు అరుణారుణ జోహార్లు చెపుతూ "ఒక వేకువ కోసం...." వెలుతురు జల్లిన జీవితాలకోసం 'నూతన ప్రజాస్వామిక విప్లవం వర్థిల్లా'లంటూ గొంతెత్తిన అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య గీతాలు చదువుతూవుంటే ఉబికివచ్చే కన్నీళ్ళను తుడుచుకొని ఉజ్వల జీవితాల వూపందుకోకుండా వుండలేం.

"జూన్ ఆరు (1992) వార్త విన్న అడవితల్లి అకు రాల్చి"ంది.

"అడవి తల్లి ఒడిలోన ఉద్యమంలో ఊపిరొదిలి"న శంకరన్న (కా।। కృష్ణారెడ్డి) ఈ పుస్తకంలోని పాటలలో కవితా వస్తువుకు నాయకుడు. అంతేకాదు. ఈ పాటల ప్రాణ స్పందనలో ఊపిరైన నూతన్, కిరణ్, రవి, కాంతన్నలు ఎర్రపూల రాశయిన శంకరన్నకు సహచరులని అర్ధమవుతోంది. మే 13న ముగ్గురినీ, జూన్ 25 రాత్రి మంచిర్యాలలో నూతన్, కిరణ్‌లనూ పోలీసులు కాల్చి చంపారు. రాజ్యహింస రాక్షసత్వాన్ని చూడండి—

"ఆదిలాబాద్ అడివిలోన
అకుల పొత్తిళ్ళలోన
అలసిపోయి కూర్చున్న
మిమ్మలను పట్టుకుంద్రె

గురిచూసి కాల్చినారు"

ఈ మరణవార్త విన్న ప్రజలు "బువ్వనీళ్ళు మరచినారు." "రాలిన మీ నెత్తురు చుక్కలు రగల్ జెండాలై ఎగిసె"నంటూ ప్రజలు వీరులకు జోహార్లు చెప్పారు.

నూతన్ అనీ వేణన్న అనీ పిలవబడే కా॥ పవన్ కుమార్ స్మృతి కోసం ప్రజలు పాడుకొన్న పాటలు ఈ పుస్తకంలో అయిదున్నాయి.

—'వేణన్న అంటే పేద ప్రజల దండు' అంటారు ప్రతిన్

—'త్యాగాల మందారం వేణన్న' అంటారు శశి

మిత్ర తన "నెత్తురు జెండ నెగిరేస్తవ...." పాటలో వేణన్నంటే....

— 'గోండన్నల గుండె దీప'మనీ

— 'ఇత్తనాల ధాన్యరాశి' అనీ

— 'ఎగిసిపడ్డ జలపాత'మనీ

— 'గున్న మామిడిపండ్ల తోట'నీ

— 'బొగ్గు గనుల్లో మంట' అనీ

తేనె తుట్టెలాంటి తనపాటలో మిత్ర తన మిత్రుడు వేణన్నను అద్భుతంగా దృశ్యీకరిస్తూ నూతన్ చెరగని చిరునవ్వులను, త్యాగాల కొత్త చరిత రూపాన్ని ఆవిష్కరించాడు. తూటాల కెదుర పాఠాలు చెప్పిన పవన్‌కుమార్ విప్లవోద్యమ చరితార్థుడైనాడని మిత్ర తన రచనలో అత్యంత శక్తివంతంగా చెప్పారు.

'నెత్తుటి మడుగుల సూర్యుడు మా వేణన్న' అంటూ—

"చుక్క చుక్క తన వేడి నెత్తురుని

చుక్కాని జేసి పోరు నడిపిండో" మాయన్న వేణన్న తాకిన గరిక పూలు గన్నులై దోపిడి గుండెల్లో పేలతాయంటారు ప్రతిన్ తన రచనలో.

"పాటలల్లే అన్న ఏడానీ పేదలంతా అడుగుతున్నారే !ఓ నూతనన్నా. పాణి గ్రాహి వారసుడవు. కన్నీటి చుక్కలదండ లేస్తామే" అంటూ పోరుతల్లి ముద్దుబిడ్డ నూతన్‌ను గానం చేశారు ఎన్నార్.

దేవ్ రచన "అడవితల్లి ఘోష"

వేణు రచన "వెలుగు చుక్కలు"

మల్లయ్య రచన "మీ బాట మే మొస్తము"

ఈ పాటలన్నీ ఒకపక్క గుండెలను పిండేస్తూ, మరోపక్క ఈ వ్యవస్థమీద విపరీతమైన కోపం తెప్పిస్తాయి.

గోదావరి లోయ ప్రతిఘటనోద్యమ సారధి భౌతికంగా మరి లేడని తెలిపిన వార్త! అమూల్యమైన శంకరన్న ఉజ్వల జీవితం అర్ధాంతంగా ముగిసిపోయిందన్న వార్త! అశేష ఆంధ్ర ప్రజలతోబాటు అరుణోదయ కళాకారుల హృదయాలనూ కుదిపివేసింది. ఉబికి వచ్చే కనీళ్ళని తుడుచుకొని శంకరన్న స్మృతి గీతాలను పాడారు—

"పల్లె పల్లె పోరు దండాలు" పెట్టారు.

సీతగారి "ప్రతిఘటనా సారధి శంకరన్నా" పాటలో శంకరన్న విప్ల వోద్యమ స్వరూపాన్ని విచారం ఉద్వేగాల కలగలుపు భావోద్రేకంతో అక్షరాలలో ఆవిష్కరించారు.

"శంకరన్నేడంటు / అడవి హోరెత్తంగ / కళ్ళనీళ్ళొత్తుకొని/ కదనానికురకంగ-శంకరన్నా-శంకరన్నా" అంటూ పుల్లన్న పాట సాగిపోయింది.

శంకరన్న మరణవార్త విన్నాక ప్రకృతంతా ఏ విధంగా వుందో ప్రతిన్ తన పాటలో చిత్రించిన తీరు....ఒకటి రెండు దృశ్యాలు—

— తూర్పు ఎరుపు నల్లగయ్యింది

— దూకుతున్న జలపాతం ఆగిపోయింది

— ఏరులన్నీ పరుగు మానాయి

— చెలమలన్నీ ఏడ్వసాగె

— కౌజుపిట్ట కన్నీరెట్టింది

— పోరులాంటి ఆకసాన ఉల్క ఒక్కటి నేల రాలెరా

ఇంకా ప్రతిన్ తన పాటలో శంకరన్నను ఇలా కోరుతారు—

— చినుకు చినుకయి కురిసి రమ్మని

— మా పల్లె చెరువయి నిండిపొమ్మని

ప్రతిన్ మన శంకరన్న ఉనికిని ఎలా గుర్తిస్తున్నాడో చూడండి—

— మా పోరు దీపం చమురు వైతివో

— మా వేడి జింకల ముద్దు వైతివో

— ఉద్యమాల అడివి నీవై అల్లుకుంటివో

— ప్రతిఘటనా పోరు నీవై సాగుతుంటివో

— మా పోరు సంద్రంల హోరు వైతివా

— మా ఎర్రపూల రాశివై తివా

— ప్రజా రాజ్యం పంట వైతవో

అన్నజాడ చెప్పవే, ఏడ్వకే ఏడ్వకే కోయిలా, కిట్టు పాట గొంతెత్తి పాడవే అంటూ మనల్ని అడవిలో కోయిల చెంతకు తీసుకు పోతారు.

"నీ ముద్దు తుపాకీ

చినబోయి చూస్తుంది" అంటారు రాజారాం. ఆ తుపాకీని అందుకోవాలనిపిస్తుంది పాఠకులకు.

"ఉద్యమంలో ఉషస్సు శంకరన్న"ంటూ నరేందర్ మరో మంచి స్మృతి గీతం రాశారు.

"శంకరన్న ఆశయ సాధనకై" రాధ రాసిన పాట

"ఎర్రజెండను నిలుపుకుంటామో" అంటున్న చంద్రకళ రచన

"కృష్ణారెడ్డికి రెడ్ సాల్యూట్" చెబుతున్న కె. రాములుగారి గీతం గుర్తుంచుకో దగ్గవిగా వున్నాయి.

"రేపటి స్వప్నం కిట్టన్న" అంటున్న నారాయణస్వామిగారు గొప్ప ఉద్వేగంతో స్మృతి గీతాన్ని ముంచెత్తారు—

"చిగురాకు కొమ్మపై నిదురించినా అన్న
ఆయుధపు పూలై పొద్దుపొడుచునులే"
"నింగిలో హరివిల్లు తొంగి చూస్తేనూ
అది కిట్టన్న నవ్వనీ నల్దెసల పాడండి"
"పుప్పొడి తరగలపై అన్న అడుగుజాడ
గాలి అలలమీద తేలిపోతున్నాది"
"కన్నీట భారమై నలుపెక్కినా మొగులా
కురవవే కురవవే జడివాన కురవవే
అన్న స్మృతివై నీవు పోరాట పాఠమై
మా కనుల భూములను తడిపి ముంచెత్తవే"

ఇలాంటి భావ చిత్రాలను కవిత్వంలో ప్రవేశ పెట్టగల శక్తి విప్లవోద్యమ కవులకు మాత్రమే వుంటుంది. విప్లవోద్యమ కవులతో సంబంధాలు కలిగిన కవులు విప్లవ ఫ్యాషన్ కవిత్వాన్ని మాత్రమే రాయగలరు. విప్లవోద్యమ కవులు విప్లవ సాహితీ సాంస్కృతికోద్యమాలకు హృదయ మవుతారు. విప్లవ సాహితీ సాంస్కృతికోద్యమ ప్రయోజనాలు ప్రజా విప్లవోద్యమాలతో ముడి పడి వుంటాయి. అవి ఉద్యమాలు పురోగమించేందుకు తోడ్పడుతూనే ప్రజానీకానికి విప్లవ చైతన్య స్ఫూర్తిని అందజేస్తాయి. ఈ కర్తవ్యాన్ని "ఒక వేకువ కోసం...." ద్వారా అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య శక్తివంతంగా నిర్వహించింది. విప్లవ విషాదాన్ని కర్తవ్య రాగంతో కావ్యగానం చేసింది.

---

ఒక వేకువకోసం.... అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య ప్రచురణ. వెల : లేదు. పేజీలు : 38. దొరకుచోటు : మైత్రీ బుక్ హౌస్, ఏలూరు రోడ్డు, మసీదు వీధి. విజయవాడ, మరియు విమోచన, నల్లకుంట, హైదరాబాద్-44.

# సాహిత్య సాంస్కృతిక వార్తలు

ఉదయం జర్నలిస్టు గులాం రసూల్‌ని ఎన్‌కౌంటర్ పేరుతో పోలీసులు చేసిన హత్యపై స్పందిస్తూ డా॥ చెరుకు సుధాకర్ రాసిన కావ్యమే "దృశ్య కావ్యం". డిసెంబరు 31 రసూల్ వర్ధంతి నాటికి ఈ కావ్యాన్ని ఆఫ్‌సెట్‌లో బ్రెయిలీలో తెచ్చే ప్రయత్నంలో వున్నారని డా॥ చెరుకు సుధాకర్ తెలియ జేస్తున్నాం.

---

(2 వ కవరు పేజీ తరువాయి)

అవినీతి మంత్రంటు కోర్టు తీర్పిచ్చినా
దండుగట్టి మనం కదులుదాం - గద్దెనుండి దొరల దించుదాం

సారతాగొద్దని సదువులే చెప్పింద్రు
సారతాగితే సాన నష్టమని అన్నారు
గల్లి గల్లికి సారా అంగళ్ళు పెట్టింద్రు
ఎన్నికల్లో సార ఏరయ్యి పారును
కల్లభొల్లి కారుకూతలే - మన నెత్తురు తాగేటి ఎత్తులే

మంత్రులంతా కల్సి మాయ జేస్తున్నారు
సారా తాగి జనం కాటి పాలైతుంటే
సారా పైకంతోటి కూడు బెడ్తారంట
దొంగ మంత్రుల గుట్టు మనకు దెల్వకుండ

సారామత్తుల ముంచివాడు-డబ్బు బ్యాంకుల్లో దాచిండు జూడు
పోలీసు స్టేషన్లు సారాకొట్లయినాయి
కూడు గుడ్డలేక కూలోల్లు చస్తుంటే
పల్లెల్ని చుట్టేసి పోలీసు కొడుకులు
సారా తాగండంటు సావదంతున్నారు
ప్రజల రక్షణ మర్చినారు - సారపాకెట్లు అమ్ముతున్నారు

లాఠీలు మోగినా తూటాలు కురిసినా
కల్తీసారా దొరలు అడ్డొచ్చి నిలిచినా
జట్టుగా మనమంత ఎదిరించి నిలవాలె
సారమీద పోరు వదలక - కూడు గుడ్డ కొరకు కదులుదాం

వాడని మందారాలు :

# కల్లు మానండోయ్!

చిత్రం :
రోహిణీ పిక్చర్స్ 'గృహలక్ష్మి' (1938)

నిర్మాత :
హెచ్. యమ్. రెడ్డి

కల్లు మానండోయ్ బాబూ
కళ్ళు తెరవండోయ్!
లెండు భారతీయులారా!
నిదుర లేవండోయ్! మీరు
నిదుర లేవండోయ్!
ఇళ్ళూ వొళ్ళూ గుల్లచేసే
కల్లు మానండోయ్ బాబూ
కళ్ళు తెరవండోయ్!
కుడువ కూడూ తొడుగ వలువా
లేని పిల్లల గోడూ చూచీ
నిలువ నీరే సతినిగాంచీ
తాగకండీ! మీరు తాగే
కల్లది వారి రక్తమే సుమండీ!
బీదల పీల్చితినే మహమ్మారి
ప్రభువులు కొల్చుకునే పింజారీ
దేశ దరిద్రతకే రహదారీ
పాన పిశాచము పారదోలీ
భారత కీర్తిని నిలుపగదండీ!
లెండు భారతీయులారా!
నిదుర లేవండోయ్! మీరు
నిదుర లేవండోయ్.

---

"సారాతో....పాలకవర్గాలు కోట్లాది ప్రజలను చాలా నమ్రతగా, నిశ్శబ్దంగా అత్యంత అహింసాయుతమైన పద్ధతుల్లో నెమ్మదిగా మృత్యువు వైపునకు నడిపిస్తున్నారనడంలో ఏ మాత్రం అతిశయోక్తి లేదు". —తరిమెల నాగిరెడ్డి

## సమాజం వెన్నుపై పుట్టిన రాచపుండు (సారా వ్యాపారం) నగ్న స్వరూపాన్ని చిత్రించిన నవల

# అగమ్య గమ్యం

—కొత్తపల్లి రవిబాబు

సమకాలీన సమాజాన్నీ, ప్రజల బాధల్నీ, గాథల్నీ చిత్రిస్తూ, సూచన ప్రాయముగానైనా పరిష్కారాన్ని ప్రబోధించే నవలలు చాల అరుదుగా వస్తున్నాయి. అటువంటి అరుదైన నవలల్లో ఒకటి చావా శివకోటి నవల 'అగమ్యగమ్యం'.ఇది 1990లో ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రికలో సీరియల్‌గానూ. ఆ తర్వాత 1992 జనవరిలో పుస్తక రూపంలోనూ (నవజ్యోతి) ప్రచురింపబడింది.

సారా వ్యాపారుల ప్రపంచం ఒక అధోజగత్తు. కంటికి లేని వారి డబ్బుతో కోట్లకు పడగలెత్తే వారి మాయా ప్రపంచం అది. దానిలో నీతినియమాలు లేవు. మానవతా విలువలు లేవు. సర్వం డబ్బే! ఎవరు ఎవరిని ఎంత గొప్పగా మోసం చేయగలిగితే అంత గొప్ప సారా కింగ్ అయిపోతాడు. ఈ సారా కింగ్ కింద గూండాలుంటారు. వీడే మరింత బలిస్తే మఫియా లీడరౌతాడు. మంత్రులనూ, పోలీసు వ్యవస్థనూ, న్యాయ వ్యవస్థనూ తన చేతుల్లోకి తీసుకుంటాడు. తన కిష్టమైన వారిని ఎన్నికల్లో నిలబెట్టి, రిగ్గింగ్ చేయించి గెలిపిస్తాడు. తన కనుకూలంగా వుండే దిన పత్రికనో, వారపత్రికనో ప్రారంభిస్తాడు. ఒక్కోసారి తానే రాజకీయాల్లోకి దిగి మంత్రి పదవి నధిష్టించి 'ప్రజాసేవ'కు 'అంకిత' మౌతాడు.

సారా వ్యాపారంలోని కిటుకులూ, దాని గుట్టుమట్లూ, ఇబ్బందులూ మొదలైన విషయాలన్నిటినీ ఈ నవల పాఠకులకు పరిచయం చేస్తుంది. ఎక్కడో ఖమ్మం జిల్లాలోని పల్లిగూడెం నుంచి పొట్ట చేత పట్టుకొని వలస వచ్చి ఒక కుగ్రామంలో సారాకొట్టు పెట్టుకున్న ఎల్లాపి సత్తిగాడు- ఎల్లాపి సత్యనారాయణగానూ- ఆ తర్వాత కుబేరుడైన ఏ.ఎస్‌గా అంచెలంచెలుగాను ఎదిగిపోవడాన్ని రచయిత ఈ నవలలో చిత్రించాడు.

సారాయి కంపెనీలలో మూడు రకాల పార్టనర్స్- స్లీపింగ్ పార్టనర్స్ (వాటా వుంటుంది. రోజువారీ వ్యవహారాలలో కల్పించుకోరు. లెక్కలప్పుడూ పంపకాలకూ వస్తారు): వర్కింగ్ పార్టనర్స్ (వాటాతోపాటు పని చేస్తారు. జీతం తీసుకుంటారు): మేనేజింగ్ పార్టనర్స్ (వ్యాపారానికి మూల పురుషులు- వీరు చెప్పిందే శాసనం) వుంటారు. సారా వ్యాపారంలో నమ్మిన ముగ్గురూ మోసం చేయడంతో చితికిపోయిన హరిశ్చంద్రరావు ఎల్లాపి సత్తెం సారా కొట్టులో వాడుకగా సారా తాగుతూ, తనకు జరిగిన మోసాన్ని కథలు కథలుగా చెప్పేవాడు. అవన్నీ సత్తెంకు

ఉపయోగపడ్డాయి. సారా జీవుల మనస్తత్వాలను అర్థం చేసుకున్నాడు. సారా కొట్టు పెట్టిన రెండేళ్ళలో వ్యాపారంలో వర్కింగ్ పార్టనర్‌గా చేరాడు. ఇక ఆ తరువాత అంతా ముందుకు దూసుకు పోవడమే. కంపెనీ మేనేజర్ శంకరం ఆడపిచ్చిలో పడి హత్యకు గురికాగా, సత్యనారాయణ శంకరం ఓచర్లను తారుమారుచేసి లక్షలు తనవిగా చేసుకున్నాడు. ఇక అప్పటినుంచీ ఏ.ఎస్‌గా మారిపోయాడు.

మహంకాళి పాపారావు అనబడే యం.పి; పెంట్ల పుల్లారావు అనబడే పి.పిలు కూడా సారా కింగ్‌లే. వీరిద్దరూ కలిసి ఎం.పి. బాటిల్స్ అనే సారాయి కంపెనీ యజమానులు. వీరికి బాబ్జీ అనే రాజకీయ నాయకుడి అండ దొరికింది. దౌర్జన్యంగా వ్యాపారం నడిపారు. అయిదు జిల్లాల్లో పాటలు పాడాలనుకుని బాబ్జీని వా టా కలువమని అడిగితే, ఈ సారా వ్యాపారాన్ని అసహ్యించుకునే బాబ్జీ ఇలా అంటాడు.

"ఈ సారాయి సగటు మనిషి డ్రింక్. పగలంతా పడ్డ కష్టానికి- చీకటి మొదలవుతుండగా రిలాక్స్ అయ్యేందుకూ, శ్రమ మరచిపోయేందుకూ పుచ్చుకొనే ద్రవం. ఇది ముప్పయి పైసలకు డ్రాము నుంచి మొదలై ఇవ్వాళ మూడు రూపాయల కమ్ముతున్నారు. కొన్నిచోట్ల యింకా దాటిపోయింది. దీనికి రోజువారీ అలవాటు పడిన బడుగు వర్గాలు, వారి కుటుంబాలూ ఈ భారానికి వీధుల పాలవుతున్నాయి. ఇల్లాళ్ళ మెడల్లో పుస్తెలు కూడా మిగలడం లేదు. చివరికి పెళ్ళాలని తార్చికూడా తాగే దుస్థితి ఏర్పడుతుంది. మనిషి అనే వాడి కున్న అన్ని విలువలూ ఈ 'వ్యసనం' హరించి వేస్తుంది. ఇలా ఇందరి దౌర్జాన్యానికి కారణమై వస్తున్న ఈ డబ్బు నెత్తుటి కూడు కంటే అన్యాయమైంది. ఎందరి మానాలు, ఎందరి ఆర్తనాదాలు, ఎందరి బాధలు, ఎందరి కన్నీళ్ళు, ఎందరి రక్త మాంసాలు ఉచ్చుగా మారి మన చేతికొస్తున్నాయో ఒక్కసారి ఆలోచించి చూడు. ఎందరెందరి ఉసురుకో గుర్తు ఈ డబ్బు. ఈ డబ్బును నేను జీర్ణించుకోనూలేను. భరించనూలేను. కనీసం ఈ వ్యాపారపు జాడలోకి రావడానికి కూడా నా మనస్సు ఒప్పుకోదు" ఇంతటి నిజాయితీతో ఆలోచించే రాజకీయ నాయకులు ఈనాడు నూటికో, కోటికో ఒకరుంటారేమో. పేద ప్రజల ఉద్ధరణ లక్ష్యంగా కృషి చేస్తున్నామని చెప్పుకొనే కమ్యూనిస్టు పార్టీ నాయకులే సారా వ్యాపారస్తులుగా, సిండికేట్లలో వాటాదార్లుగా జిల్లాలు జిల్లాలే కొనేసుకుని కోటికి పడగలెత్తిన సిగ్గుమాలినతనం మన కళ్ళముందు ప్రత్యక్షమౌతుంటే, బాబ్జీలాంటి రాజకీయ వాదులు సమాజంలో వున్నారంటే నమ్మబుద్ధి కాదు.

ప్రభుత్వం ప్రజలకు తాగమని ప్రోత్సహించి, ఈ వ్యసనానికి జనాన్ని చేజేతులా బానిసల్ని చేసి, తద్వారా వచ్చే మైకంతో 'ప్రజా సంక్షేమ' చర్యలను చేపడుతుందని చెప్పడం హాస్యాస్పదం. సాలీనా ఇంత పర్సంటేజ్ ఆదాయం ఎక్కువ రావాలని ఎక్సైజ్ శాఖ నిర్ణయిస్తుంది. వేలం పాటప్పుడు గత సంవత్సరం రెంటల్ కంటే మరో లక్ష పెంచుతారు అంటే సారా కాంట్రాక్టర్లను, ఇంకో పదీ

శాతం ట్రాగుబోతుల్ని ఎక్కువ చేయమనడమే. ఈ వ్యాపారంలో ఎక్సైజు శాఖ- కంట్రాక్టర్లు పరస్పరం సహకరించుకుంటారు. వారి వారి కేటగిరీలను బట్టి ఎక్సైజ్ పోలీసులకు- క్రిందనుండి పైవరకు నెలకింత పైకం అని అయిదో తేదీకల్లా ప్రతి నెలా ప్రభుత్వ జీతంలా అందాల్సిందే. ఈ మామూళ్ళను కంట్రాక్టర్లు 'మాసికాలు' అంటారు. ఎక్సైజ్ వారేమో దీన్ని యం.జి. ఫండ్ అంటారు. అంటే మహాత్మ గాంధీ నిధి అని అర్థం! విలువల పతనానికి ఇది ఒక నిదర్శనం! ఈ లంచం తిన్న ఎక్సైజ్ అధికారులు, పాట పాడుకున్న సారా కంట్రాక్టర్లు దొంగ సారా వ్యాపారం చేస్తుంటే చూసి చూడనట్లు వదిలేస్తారు. అప్పుడప్పుడు పట్టుకున్నట్లు నటించి, వ్యాపారులకు పెద్ద నష్టం లేని విధంగా ప్రవర్తిస్తారు.

అయిదారుగురు కంట్రాక్టర్లు కలిసి పెద్ద గ్రూపుగా పాట పాడుకోవడం సిండికేట్ సిస్టమ్‌కు దారి తీసింది. పూర్వం కాపు సారావాళ్ళు, బ్రాకెట్ నడిపేవారు, మూడు ముక్కలవాళ్ళు, బ్రోతల్ కేసులు నడిపేవారు ఈ వ్యాపారంలో వుండేవారు. క్రమంగా దీనిలోకి వ్యాపారంలో సిద్ధహస్తులైన 'మర్యాదస్తులు' కూడా అడుగు పెట్టారు. రాష్ట్ర స్థాయి వ్యాపారస్తులుగా ఎదిగారు. పొరుగు రాష్ట్రాలైన కర్నాటక, మధ్యప్రదేశ్‌లలో కూడా వేలంలో పాల్గొని వ్యాపారాలు నడిపారు. అలా నడిపిన వారిలో ఒకడు బాపూజీ.

ఈ బాపూజీకి చెందిన సిండికేట్ మూడు పూవులూ, ఆరు కాయలుగా విలసిల్లుతున్న కాలంలో ఉప ఎన్నికలు వచ్చాయి. తాను పాల్గొనక పోయినా, అధికార పార్టీకి వ్యతిరేకంగా ఎన్నికల్లో కృషి చేసాడు. అతని అభ్యర్థులు గెలిచారు. ప్రభుత్వ పక్షం దిమ్మెర పోయింది. బాపూజీ విజయానికి కారణమేమిటా అని ఆలోచించారు. బాపూజీకి ప్రజల్లో మంచి పేరుంది. దానికి తోడు సారా కంట్రాక్టర్‌గా జిల్లాలోని ప్రతి పల్లెలోనూ సంబంధం వుంది. ప్రతి వూరిలోనూ ఒక సారా దుకాణం, దాని రక్షణకు ఒక జవాన్ కావాలి. కొందరు పెద్దలు కావాలి. అంటే వూరిలో ఒక వర్గంతోనూ, వ్యక్తులతోనో సంబంధాలు వున్నట్లు తనకి వచ్చిన లాభంలో వీరికి పది శాతం చందాల రూపంలో ఇస్తాడు. అన్ని పార్టీలకూ హితుడిగా వుంటాడు. పారలల్ గవర్నమెంట్ లాంటి ఎడ్మినిష్ట్రేషన్ వుంటుంది. పోలీసులకు, ఎక్సైజ్ వారికీ, జీతాలంత మామూళ్ళు నెల నెల వెళ్తాయి. ఇక ఇన్‌కంటాక్స్‌వాళ్ళు, బ్యాంకుల వాళ్ళు, డి.టి.వో వాళ్ళు, రెవిన్యూ వాళ్ళు, తూనికలు, కొలతల వాళ్ళు-ఇలా ప్రభుత్వ అధికారులందరితో సత్సంబంధాలు వుంటాయి. ఈ విధంగా సిండికేటులోని సారా వ్యాపారులకు-తలచుకుంటే రాజకీయాల్లో ప్రవేశించే, గెలిచే అవకాశం లభించింది. కనుక ప్రభుత్వం ఈ మోనోపలీని ఆపాలని నిర్ణయించింది.

ఫలితంగా గుత్తాధిపత్యాన్ని తగ్గించడానికి రేంజిల వారీగా వున్న వేలాన్ని రద్దు చేయాలి. ప్రస్తుతం తాలూకాలో వున్న వూళ్ళను ఒక రేంజిగా ఎంచి, సాలు

కింత సారా ఎత్తాలనే నిబంధనతో మూడు నెలలు గ్యారంటీ కడుతూ, నెలవారీ కిస్తీలను వేలం పెడుతున్నారు. అయితే కొత్త పద్ధతి ప్రకారం ప్రతి దుకాణాన్నీ విడగొట్టారు. విడగొట్టిన దుకాణాలకు పాత అంచనాల ప్రకారం బేరీజు తీసుకొని రేషన్‌ను ఫిక్స్ చేశారు. ఒక్కొక్కరు ఒక్క దుకాణం- అవసరమైతే అయిదు దుకాణాల వరకూ పాడవచ్చునన్నారు. ఆ పైన వేలం పాడే అర్హత లేకుండా చేశారు. రెంటల్ (నెల కిస్తీ)ని పైకంలో కాన్‌రేషన్‌లో కల్పేస్తారు. అంటే ఇన్ని రూపాయలకి కాదు వేలం- ఇన్ని లీటర్లని. అదీ సంవత్సరానికి అయ్యే రేషన్‌ని ఒకేసారి పాడాలి. జిల్లాలో వెయ్యి దుకాణాలుంటే పాటదారులందరూ రావాలి. ఎవరెక్కువ పాడితే వారికి దుకాణం వస్తుంది. ఈ సారాకి రేటు నిర్ణయించారు.

ప్రివిలేజు ఫీజూ, సారా రేటూ, సేల్స్ టాక్సూ, ఇన్‌కం టాక్సూ కలిసి లీటరుకు 25 రూపాయల నుంచి 70 రూపాయల వరకు నిర్ణయించారు. పల్లెలకు డిపాజిట్‌గా రెండు వేల రూపాయలూ, పట్నాలకు పన్నెండు వేల రూపాయలు నిర్ణయించారు. ఇవి తిరిగి ఇవ్వరు. ఇది కాక నెలా పదిహేను రోజుల పైకం డిపాజిట్‌గా ముందు కట్టి దుకాణం లైసెన్సును ఎత్తుకోవాలి. లోగడ కంట్రాక్టర్లకు లూజు సారాయిని ట్యాంకర్లతో రేంజులకు చేర్చి, ఆ తర్వాత దుకాణాలకు సప్లయి చేసేవారు. ఇప్పుడు 90, 45 గ్రాముల పాకెట్లూ, 180, 360 గ్రాముల సీసాలూ రంగంలోకి వచ్చాయి.

ఈ సీసాలనూ, పాకెట్లనూ నింపేందుకు జిల్లాకొక ప్లాంట్‌ను కట్టారు. ఈ ప్లాంట్ దగ్గరికి రేషన్ సారాయిని వారే సప్లయి చేసుకుని, అక్కడ పాకెట్లనూ, సీసాలనూ నింపి దుకాణాల ద్వారా ఎ. డి. ఎం. ల ద్వారా తరలించేందుకు ఏర్పాటు చేశారు.

అయితే ఈ పథకాన్ని రాష్ట్రమంతటా ఒకేసారి అమలు పరచేందుకు ధైర్యం చాలలేదు. కనుక ముందుగా ఖమ్మం, కడప జిల్లాలలో ప్రయోగం చేశారు. ఈ రెండు జిల్లాలలో బాట్లింగ్ ప్లాంట్‌లు పెట్టి ప్యాకెట్లూ, సీసాలు నింపేందుకు పనులు ప్రారంభించారు. అగస్టులో వేలం పాటలు ప్రారంభమైన తర్వాత, ఈ పద్ధతి కంట్రాక్టర్ల గుత్తాధిపత్యాన్ని నిజంగా బద్దలు కొట్టిందన్న సత్యం తెలిసింది. కానీ ఆ తర్వాత ఇది రాజకీయ పార్టీల, గ్రామ పెత్తందార్ల గుత్తాధిపత్యానికి బలి అయిపోయింది.

ఒక పాలెంలో రోజుకు వంద లీటర్లు అమ్మకం వుంటే, నెలకు మూడు వేల లీటర్లు, సంవత్సరానికి 36 వేల లీటర్లకు ఈ గ్రామాన్ని పాడాలి. కాని ఆ పాలెం పెత్తందారు ఒకడే పాటకు వచ్చి మూడు, నాల్గు వేలకు పాడుకుంటాడు. ఆ తర్వాత ప్రక్క జిల్లా నుంచి తెప్పించుకునో, దొంగ సారా కాచో మిగిలిన డిమాండ్‌ను తట్టుకో గల్గుతాడు. ఈ విధంగా అమ్మిన సారా డబ్బంతా కాంట్రాక్టరుదే. మరిక కోటీశ్వరుడు కాక తప్పదు!

నవలా రచయిత ఒకచోట 'అంటీ' కొట్టడం అంటే ఏమిటో ఇలా వివరించారు. "లెక్క ప్రకారం డ్రాము అంటే నూరు గ్రాములు పోయాలి. ప్రభుత్వమే 90 గ్రాములు పోస్తుంది. ఇలా మిగిల్చిన 10 గ్రాముల సారాని 'అంటీ' అంటారు. జాడీల పద్ధతిలో లూజు సారా అమ్మినపుడు ఈ అంటీ బాగా జరుగుతుండేది."

రచయిత ఈ సారా వ్యాపారంపై చేసిన దాడి ఈ క్రింది మాటల్లో చూడండి. "ఈ వ్యసనాన్ని రూపుమాపాల్సిన మన ప్రభుత్వాలు దీన్ని అందమైన, ఆధునికమైన వ్యాపారంగా మార్చి ఆర్థిక వనరుగా చేసి రెవెన్యూగా వసూలు చేస్తున్నారు. ఈ రెవిన్యూతో 'జాతి జీవనాన్ని బాగుచేద్దామనే' అతి హేయమైన దుర్భ్రమలో వున్నారు నేతలు.... గంజాయి పండిస్తే లాభాలొస్తాయి. వేశ్యా వాటికలు తెరిస్తే లాభాలొస్తాయి. ఇప్పపువ్వు సారా పెద్దయెత్తున కాస్తే లాభాలొస్తాయి. ఆర్. ఎస్. ను బాగా విడుదల చేస్తే లాభాలొస్తాయి. సారాయిని బాగా త్రాగిస్తే లాభాలొస్తాయి. సంస్కృతీ చిహ్నాలను అమ్ముకుంటే లాభాలొస్తాయి అనీ, బోలెడు రెవెన్యూ వస్తుందనీ, వీటన్నిటినీ వ్యాపారాలుగా ప్రభుత్వాలు చేపట్టే దుస్థితి ఈ దేశానికి దాపురించే రోజు అతి త్వరలో రాబోతుందేమోనని భయమేస్తుంది." ప్రభుత్వం అలా ఆలోచిస్తుంటే, కొన్ని తీవ్రవాద ముఠాలవారు సారాయి రేటు తగ్గించాలని ఆజ్ఞాపించడాన్ని రచయిత తీవ్రంగా విమర్శించారు. ఎవరైనా చేయాల్సిందేమిటంటే 'బాబూ, సారా త్రాగవద్దు....అది వ్యసనంగా మారుతుంది. దాని జోలికి పోయినవాడు ఆ మత్తుకు బానిసయి పోతాడు. కుటుంబాన్ని ఆదుకోలేడు కదా, నిలచి నడుస్తున్న కుటుంబాన్ని కూలుస్తాడు. ఇంటిల్లి పాదికీ భారమౌతాడు, తాను అనాధ అయి, సంసారాన్ని అనాధగా మారుస్తాడు. మీ కాళ్ళపైన మీరు నిలబడాలంటే త్రాగుడును మానేయండి - మత్తులో పడకండి....సర్వనాశనానికి హేతువిదే' అని చెప్పాలి.

ఇక దొంగసారా తయారుచేసే ఈ సారా రాజుల మిషన్లపై ఎక్సైజు వారు చేసే బూటకపు దాడుల గురించి స్పష్టంగా ఇటీవల దిన పత్రికల్లో నెల్లూరు జిల్లా కంట్రాక్టరు, సినిమాల నిర్మాత రావుల అంకయ్య గౌడ్ ప్రకటించారు. అటువంటి సన్నివేశమే ఈ నవలలో ఒకటి వుంది. నర్సింహం అనే కంట్రాక్టర్‌గారి మిషన్-సారాయి ప్యాకెట్లు తయారు చేసే మిషన్ వోల్టాస్ కంపెనీది- ఆరు వేల లీటర్లు రోజుకు ప్యాక్ చేయగలదాన్ని - పది బారల్స్ రెక్టిఫైడ్ స్పిరిట్ (R.S.), నాలుగు వేల లీటర్ల లూజు సారాయి, ఆరు బండిల్స్ పేపరు, రెండు వేల లీటర్ల ప్యాకెట్లు ఎక్సైజ్‌వారి స్పెషల్ స్క్వాడ్ దాడిచేసి పట్టుకుంది. అయితే ఏం, కేసు నర్సింహం మీద పెట్టరు. అక్కడున్న వాచ్‌మన్ పైనో, మిషన్ నడిపే వాడిపైనో పెడతారు. మిషన్ మొదలగు సరంజామా ఎత్తుకెళ్ళడానికి వచ్చిన లారీ, మంత్రిగారు కలుగ

---

"దొంగతనం కంటే, వ్యభిచారం కంటే కూడా తాగుడు నీచమైనది. అనేక సందర్భాల్లో తాగుడే ఈ రెంటికి ప్రేరక మవుతుంది". —గాంధి

చేసుకోవడంతో భాగీగా వెళ్ళిపోయింది. దొరికిన సరుకు వివరాలు తారుమారయ్యాయి. కేసు ఆ ఇంటి యజమానిపై పెట్టారు. మిషన్‌కు మాత్రం పెద్దలు 20 వేల రూపాయల పెనాల్టీ వేశారు.

రీ ఆక్షను (తిరిగి వేలం వేయడం) ద్వారా ఎక్సైజ్ అధికారుల జేబుల్లోకి వచ్చే ఆదాయం కోట్లు కోట్లు. తిరిగి వేలం వేసేటప్పుడు పాత దుకాణాదారుడ్ని పూర్తిగా తొలగిస్తారు. దాన్ని ఎక్సైజ్ వారు స్వాధీనం చేసుకుంటారు. అయితే వారి చేతికి వచ్చినవన్నింటినీ నడుపుతూ వుండాలి. ఆలా నడుపుతున్నపుడే తిరిగి వేలం నిర్వహింపబడుతుంది. వేలం పాడుకున్న వానికి లైసెన్సు ఇచ్చి, రేటిచ్చి దుకాణాన్ని అప్పగించాలి. ఈమధ్య కాలంలో నలభై లీటర్లు అమ్మే షాపు వుంటే అయిదు లీటర్లు అమ్మకం చూపుతారు. మిగిలిన లీటర్లను మరొకడితో అమ్మించి, వచ్చిన పైకాన్ని పంచుకుంటారు.

అనూహ్యంగా వచ్చిపడే డబ్బు మనిషిని ఎంత అమానుషం చేస్తుందో రచయిత కొన్ని సంఘటనల ద్వారా వివరించాడు. సాధారణ దుకాణాదారుడు బక్కయ్య సారా వ్యాపారంలో ధనవంతుడు కావడంతో - స్త్రీని విలాస వస్తువు చేసి అనుభవించడం, బూతు సినిమా (నీలి చిత్రం) వి.సి.ఆర్. లో వేసుకొని, దానిలో లాగా 11వ నంబరు దుకాణాదారు మల్లయ్య కూతురు చిట్టెమ్మతో లైంగిక చర్యలు చేయడం, షరీఫ్ అనే మిత్రుడు బక్కయ్య ప్రవర్తనను అసహ్యించుకోవడం ఒక సంఘటన. మురళి అనే మరో సారా వ్యాపారి శ్రీరామ సదనంలో ఐదుగురు ఆడపిల్లలతో - అందరూ నగ్నంగా - విచ్చలవిడి ప్రవర్తనలో వుండటం - షరీఫ్ ఇది చూసి పారిపోయి రావడం మరో సంఘటన. సారా కొట్లలో, బార్‌లలో వుండే ఆడవాళ్ళ నేపథ్యం, ఏ పరిస్థితుల్లో వారు అటువంటి అసహ్యకరమైన వాతావరణంలో కొనసాగుతున్నారో, వారిపై జరిగే దాడులూ, మొదలైనవన్నీ ఈ నవలలో రచయిత చిత్రించాడు. స్త్రీ పట్ల చులకన భావం కలగడానికి మత్తు పదార్థాల ప్రభావం ఎంతైనా వుంది. డబ్బే సర్వస్వమైన సమాజంలో స్త్రీ కూడా ఒక వ్యాపార వస్తువైపోయింది. ఈనాడు స్త్రీ ఒక భార్యగా, ఉంపుడుగత్తెగా, బజారు బొమ్మగా, అమ్మగా, పురుషుని మాయా బానిస వ్యాసంగంలో తలమునకలై ఆర్తిగా జీవిస్తూ, అయోమయపు స్థితిలో అల్లల్లాడుతూ కనిపిస్తోంది !

నవలలో అక్కడక్కడా, పరోక్షంగా ఎన్టీ రామారావు హయాంలో కొనసాగిన వ్యక్తిపూజ, పాదాభివందనాలు, 'రారాజు దగ్గర బూడిద' తప్ప సామాన్యుడికి

---

"ఏ దొంగ అయినా వస్తురూపేణా వున్న వాటన్నిటినీ తస్కరిస్తాడు. అదే తాగుబోతు అయితే తన గౌరవాన్నీ, ఇరుగు పొరుగుల మర్యాదను సయితం మంటగలుపుతాడు". —గాంధి

దొరికేదేమీ లేదన్న విమర్శలు వున్నాయి. తమకు జరిగిన అన్యాయాలకు ప్రతీకారంగా శత్రువుల భార్యల పైనా, కూతుళ్ళ పైనా లైంగిక దాడులు చేసే సంఘటన లున్నాయి.

సారా ప్రపంచపు విశ్వరూపం సూక్ష్మంగా అద్దంలో చూపించడమే గాక, ఆ ప్రపంచం పట్ల ఏవగింపు, చీదర, అసహ్యం కల్గించడంలో రచయిత చాల వరకు కృతకృత్యుడయ్యాడు. అయితే ఒక ప్రధాన విషయం చిత్రించలేదు. అదే ఈ సారా కంట్రాక్టర్లు పెంచి పోషించే గూండాల గుంపులు - వారి చర్యలు. అంతేగాక యీ నవల రాసే కాలం నాటికే తెలంగాణా జిల్లాలలో సారా వ్యతిరేక పోరాటం సాగుతోంది. ఈ పోరాటం వల్ల ఆదాయం తగ్గిన సారా కంట్రాక్టర్లు గంగవెర్రులెత్తి, ప్రజలపై తమ గూండాలతో, పోలీసుల సహాయంతో దాడులు చేసి సారాను ప్రజలపై రుద్దిన సంఘటనలు కూడా నవలలో చోటు చేసుకుంటే బాగుండేది.

సారా వ్యాపారస్థుల్లో కూడా 'మహాత్ము'లుంటారని నమ్మిన రచయిత చావా శివకోటి, ఆంధ్రలోని సారా సామ్రాట్టులలో ప్రముఖుడైన మాగంటి రవీంద్రనాథ చౌదరికి ఈ నవలను అంకితం చేయడం 'సారా (రో) చితం'గానే వుంది. మాగంటి అన్నార్తుల ఆర్తి తీర్చడానికి, రామరాజ్యం స్థాపించడానికి' కృషి చేశాడని ముందు మాటలో రచయిత రాశాడు. కాని వాస్తవమేమిటంటే, చనిపోయిన తర్వాత కూడా తన 'ప్రాభవాన్ని' కొనసాగిస్తూ, తన భార్యకు మంత్రి పదవి సంపాదించి పెట్టేంతగా ఎదిగిన సారా చక్రవర్తి మాగంటి!

---

"భారతమాత తన బిడ్డలకు చదువు చెప్పించడానికే కోట్లాది తాగుబోతుల్ని భరించాల్సి వస్తున్నదంటే- అంతకంటే భారత్ బిచ్చగత్తెగా మారడాన్నే నేను ఇష్టపడతాను. పిల్లల చదువులకయ్యే ఖర్చును తాగుబోతులే భరించాలంటే దేశంలో పిల్లలు నిరక్షరాస్యులుగా మిగిలిపోవడమే మేలంటాను". —గాంధి

---

## స్వీకారం :

కథ 91, సంకలన కర్తలు : వాసిరెడ్డి నవీన్, పాపినేని శివశంకర్, పేజీలు 172, వెల : సాధారణ ప్రతి రు. 20/- లైబ్రరీ ప్రతి రు. 40/- ప్రచురణ : కథాసాహితి, 164, రవి కాలనీ, తిరుమలగిరి, సికిందరాబాద్-500 015. ప్రతులకు : విశాలాంధ్ర, నవోదయ బుక్‌హౌస్, నవయుగ బుక్‌హౌస్, హైదరాబాద్.

మట్టిగుండె (కథల సంపుటి) పాపినేని శివశంకర్, పేజీలు 134, రు. 18/- ప్రతులకు : పి. గృహలక్ష్మి, 4-5-29/90, 3వ సందు, విద్యానగర్, గుంటూరు-522 007. కథాసాహితి, హైదరాబాద్, విశాలాంధ్ర, నవోదయ, నవయుగ హైదరాబాద్.

# భ్రాత(తా)ల స్వర్గం

అమెరికా అధ్యక్ష ఎన్నికల గురించి.

ప్రశ్న : అమెరికా అధ్యక్ష పదవికి జరిగే ఎన్నికల గురించి ఏమైనా చెప్పండి.

జవాబు : ఇవి ప్రతి నాలుగేళ్ళ కొకసారి జరుగుతాయి. కొత్త అధ్యక్షుడు తన అధ్యక్ష భవనం - వైట్‌హౌస్‌లోకి ప్రవేశించగానే మరలా నాలుగేళ్ళకు రాబోయే ఎన్నికల గురించి ఆలోచించడం ప్రారంభిస్తాడు- ఈ నాలు గేళ్ళూ ఇక అదే పని.

ప్రశ్న : అధ్యక్ష ఎన్నికల సంరంభంలో ముఖ్యమైన సంఘటనలు?

జవాబు : డబ్బు చేతులు మారడం- అదీ ప్రజల వీపుల వెనుక....అదీగాక పొగ నిండిన గదుల్లో కార్యకర్తలు....

ప్రశ్న : ఎవరు వీరు? గదుల్లో పొగ ఏమిటి?

జవాబు : అధ్యక్ష పదవికి నుంచున్న అభ్యర్థికి సంబంధించిన ముఖ్యమైన డాక్యు మెంట్లన్నీ రహస్యంగా తగలబెట్టేవాడు.

ప్రశ్న అంటే....?

జవాబు : అభ్యర్థి గతంలో ప్రేమకలాపాలకు సంబంధించిన ప్రేమ లేఖలు, సైన్యంలో పనిచేసినప్పటి రికార్డు, ఆరోపణలు, సర్టిఫికెట్లు మొదలగునవి.

ప్రశ్న : అధ్యక్షునిగా నిలబడేవారి అర్హత ఏమిటి?

జవాబు : ఎవరైనా అధ్యక్షుడు కావచ్చు! అయితే అతను మగవాడై వుండాలి. తెల్ల జాతివాడు కావాలి. కుబేరుడై వుండాలి. ఎన్నికలలో నిలబడిన ఇద్దరు కుబేరుల్లో ఒకరిని ఎన్నుకోవడమే ప్రజాస్వామ్యం.

ప్రశ్న : ప్రస్తుతం అమెరికాకు శత్రువు లెవరు? రష్యానా, చైనానా?

జవాబు : రెండూ కాదు. యూరప్ దేశాలు.

ప్రశ్న : అమ్మో! మాపై యుద్ధం చేస్తారేమిటి?

జవాబు : పిచ్చి ప్రశ్న! ఎప్పుడైనా ప్రత్యక్షంగా రష్యాతో, చైనాతో యుద్ధం చేసిందా ఏమిటి? అలాగే మీ యూరప్‌పై కూడా యుద్ధం చేయం.

ప్రశ్న : మరి ఎక్కడ చేస్తారు?

జవాబు : గతంలో ఉత్తర వియత్నాంలో చేయలేదూ- అలాగే ఇప్పుడు ఇరాక్‌లో చేసాం. రేపు లిబియాలోనో, ఆఫ్ఘనిస్తాన్‌లోనో చేస్తాం.

—డా॥ కిరణ్మయి)

# తుపాకీ సన్నీలను ప్రతిఘటించే మానవతా విలువల 'అంకురం'

—విక్రమ్

అన్ని రకాల మానవతా విలువలు అతిత్వరితంగా అదృశ్యమౌతున్న ఈనాడు మానవతా విలువల ప్రాధాన్యతను సూటిగా, నీటుగా ఆవిష్కరించిన చిత్రం 'అంకురం'. ఏదో ఒకరకంగా ధనం సంపాదించడమే ఒక గొప్ప విలువగా స్థిర పడిందినాడు. ఏ పని చేయాలన్నా లాభనష్టాలు బేరీజు వేసుకోవడం ఒక జీవన విధానమై పోయింది. పేవ్‌మెంట్లపై బిక్షు వర్షీయసులు మన హృదయాలను కదిలించ లేక పోతున్నారు. పందుల గుడిసెల్లాంటి పాకల్లో ప్రజలు అల్లల్లాడుతున్నా, మన గుండెలు కరగడంలేదు. ప్రమాదానికి గురైన బాటసారి రోడ్డు మధ్యలో విల విలలాడి పోతున్నా ఎవరూ ధైర్యంచేసి అతనికి సహాయం చేయడానికి ముందుకు రావడంలేదు. నడిరోడ్డుపై జరిగిన హత్యను చూసినవారు, హంతకుడెవరో తెలిసినా అతన్ని శిక్షించడానికీ, సాక్ష్యం చెప్పడానికీ ముందుకు రావడంలేదు. పోలీసు వ్యవస్థ మొత్తంగా ప్రజా భక్షక వ్యవస్థగా రూపుదిద్దుకుంది. పోలీసు బూచిని చూసి పిల్లలు ఇంకా జడుసుకునే పద్ధతిలోనే పోలీసులు ప్రవర్తిస్తున్నారు. పోలీసులు ప్రజలకు మిత్రులుగా మారడం గగన కుసుమంగా తయారైంది. బాధితులపట్ల మానవతా విలువ లైన జాలి, కరుణ చూపించడమే నేరంగా మారిన నేడు, ఈ పరిస్థితి మారాలన్న ఆ కాంక్షతో, మార్చాలన్న దీక్షతో, ప్రేక్షకుల గుండెల్లో ఒక చిన్న అలజడి సృష్టించే ప్రయత్నమే 'అంకురం' సినిమా. సర్వత్రా భయం, పిరికితనం అలముకున్న మన సమాజంలో సత్యం కొరకు, మంచికోసం, ధైర్యంగా నిలబడాలన్న సందేశాన్ని ఎటువంటి అరుపులూ, పెడబొబ్బలూ లేకుండా నిశ్శబ్దంగా మన గుండెల్లో నిలిపే చలన చిత్రం 'అంకురం'.

ఈ చలన చిత్ర ప్రచారానికి ఉపయోగించిన పోస్టర్లతో 'మొక్కను మొల కెత్త నీయకుండా ఒక తుపాకీ గురి పెట్టబడిన' చిహ్నాన్ని లోగో (Logo) గా వాడారు. ఇది చాల అర్థవంతమైనదిగా వుంది. సమాజంలో న్యాయం, సత్యం, ధైర్యం అనే వాటిని మొలకెత్త నీయకుండా, పోలీసు వ్యవస్థ అంటే రాజ్యం బలవంతంగా ప్రయత్నిస్తున్నా, బీజప్రాయంగానైనా అవి మొలకెత్తకుండా ఆపడం అసాధ్యమన్న గొప్ప భావాన్ని ఈ లోగో సూచిస్తోంది. చిత్రంలో కూడా సింధూర అనే అమ్మాయి దృఢ చిత్తంతో ఒక పసిపిల్లవాడి తండ్రి గురించిన అన్వే షణలో, కరడుగట్టిన, పాశవిక పోలీసు వ్యవస్థను ఎదిరించిన తీరు ప్రేక్షకుల్లో మానవతా విలువల ఉన్నతత్వాన్ని ఆవిష్కరిస్తుంది. మన కళ్ళముందు పోలీసులు చేస్తున్న దారుణాలను ప్రతిఘటించాల్సిన అవసరాన్ని గుర్తు చేస్తుందీ చిత్రం. 'పోలీ

సులు లైసెన్స్‌డ్ గూండాలుగా వ్యవహరిస్తున్నా'రన్న జస్టిస్ ముల్లా మాటలకు ఈ సినిమా దృశ్యరూపకమని చెప్పవచ్చు.

ప్రజలను క్రియాశూన్యులుగా, పిరికివారిగా, కేవలం ప్రేక్షకులుగా మార్చివేసిన సంస్కృతిని ఈ సినిమా ప్రశ్నిస్తోంది. ప్రేక్షక సంస్కృతి నుంచి ప్రజలు బయట పడి క్రియాశీలతతో సమాజానికి ఎంతో కొంత ఉపయోగపడే విధంగా మానవతా విలువలను పెంపొందించు కొమ్మనమని సందేశమిస్తోంది. వరంగల్లులో డా॥ రామ నాథం హత్య, బొంబాయిలో విద్యార్థిని సంగీతా పాటిల్‌ని పరీక్షహాల్లో కిరసనాయిల్ పోసి తగలబెట్టడం, అక్షరాస్యుడైన గిరిజనుడు కేవలం కరపత్రాలు పంచిపెడ్తున్నందుకే గిరిజన గూడేలను తగలపెట్టడం, నిజ నిరూపణ కమిటీ వారికి వాస్తవాలు చెప్ప నీయకుండా పోలీసులు భయపెట్టడం మొదలైన సమకాలీన వాస్తవాలను కథలో ఎంతో నైపుణ్యంతో ఉపయోగించుకున్నారు. చిత్రహింసలకు గురైన గిరిజన యువకుడు సత్యాన్ని చిత్రం చివర్లో మేజిస్ట్రేట్ ముందు ప్రవేశపెడతారు. మేజిస్ట్రేట్ 'నీకేమైనా సహాయం కావాలా?' అని అడిగినప్పుడు అతను ఒకటే చెప్తాడు. "మాలోటి వాళ్ళ కన్నీళ్ళు కార్చేటప్పుడు, ఆ కన్నీటికి స్పందించి, వాటిని తుడిచే ఒక అమ్మ చెయ్యి కావాలి." ఆ మాత్రం ఓదార్పు వుంటే చాలు. అదీ లేదు ఈనాటి సమాజంలో.... ఈ చిత్రం చూడటం వల్ల గొప్ప అనుభూతిని పొందుతాం.

(దివి కుమార్ వ్యాసం 'అంకురం-మరొక పార్శ్వం' వచ్చే సంచికలో)

---

# సర్కారు సారనాప కలిసిరండి వురుకుదాం!

**యం. నిరంజన్**

రండిర రండిర భలే సారత్రాగు డాపుదాం
సారమ్మే దొంగలాను తరమనీకి ఉరుకుదాం—2
జేబులోనా సూత్తెనేమొ - ఒక్కపైస్స లేకపాయె
రూపాయి సారనేమొ - పది రూపాలయ్యపాయె—2
తల ముంతలమ్మి గూడ - సారబొట్టు త్రాగుతుండ్రు
తయితక్క లాడుతుండ్రు ॥రండిర॥
ఒక్కరి కంటె ఒక్కరేమో - హర్రాజు పెంచవట్టె
కల్తిసార గ్రామాల్లో జోరుగా పెట్టవట్టె—2
కల్తి గిల్తి త్రాగివాళ్ళు కన్నోళ్లల్ల చంపబట్టె ॥రండిర॥
రోజు కష్టమంతకూడ పాకెట్‌తో సరిపాయె
ఇల్లు ఒళ్ళు మేమొ గుల్లగుల్ల అయ్యిపాయె—2
కాంట్రాక్టర్ బలిసిపాయె కాలుదువ్వి బతుకవట్టె ॥రండిర॥
అక్టోబర్‌లో వుట్టి ఆగడాలు పెంచుతుంది
సర్కారు ఖజానాను చాల బాగ పెంచుతుంది—2
సర్కారు సార నాప కలసిరండి వురుకుదాం ॥రండిర॥

(8వ పేజీ తరువాయి)

ముద్దాయిలూ రాజద్రోహం నేరానికి పాల్పడ్డారు. ఈ ముగ్గురు తమ చర్యల ద్వారా చట్టబద్ధంగా ఎన్నికైన ప్రభుత్వాన్ని కూలదోయాలని కుట్ర పన్నారు. కావునా యువరానర్, ఈ ముద్దాయిలను విచారించి ఉరిశిక్ష విధించాలని న్యాయమూర్తులను వేడుకుంటున్నాను.

ఐ అబ్జెక్ట్ యువరానర్....అతి సామాన్యులైన ఈ వరాలమ్మను, మాల కొండయ్యను, విద్యావంతుడైన సత్యం మాష్టార్ని ఒకసారి చూడండి యువరానర్.... (ముగ్గురూ రంగస్థలంలో ఒక మూల నుంచుంటారు.) ఇంతటి మామూలు మనుషులకు మరణశిక్షా? ఉరిశిక్ష వేసేంతటి ఘోరం వీళ్ళేం చేశారో....పబ్లిక్ ప్రాసిక్యూటర్ గారే చెప్పాలి.

మైడియర్ జస్టిస్....వీళ్ళు చూడటానికి అమాయకులుగా కనబడవచ్చు కానీ....చాలా ప్రమాదకరమైన నేరం చేశారు యువరానర్....సాఫీగా సాగే ప్రభుత్వాన్ని స్థంభింపజేయాలని చూశారు.

మీరు అదేపనిగా....నొక్కి నొక్కి ....బల్లగుద్దీ....గొంతు చించుకొని మాట్లాడితే నేరం ఋజువుకాదు పబ్లిక్ ప్రాసిక్యూటర్ గారు....ఈ అమాయకులు ఏం చేశారో సూటిగా చెప్పండి.

ప్రభుత్వ రథానికి ఇంధనమైన సారాయిని....ఐమీన్ గవర్నమెంట్ యారక్ను.. మేరా మతలబ్ సర్కారీ దారూని తాగటం, మానేయమని జనాన్ని రెచ్చగొడుతున్నారు యువరానర్. ఆ సారాయే లేకపోతే యీ ప్రభుత్వం మరుక్షణమే స్థంభించిపోతుంది యువరానర్.

పి.పి. గారు మరీ విచిత్రంగా మాట్లాడుతున్నారు. సారా ఉండటం వల్ల ఎంతోమంది జీవితాలు నాశనం అవుతుంటే.... మన ప్రాసిక్యూటర్ గారు సారా లేకపోతే ఎంతో ఉపద్రవం జరిగిపోతుందని అంటున్నారు. అసలు మీరు సారా తాగను....తాగొద్దు అనటానికీ, ఈ సామాన్యుల మీద అన్యాయంగా మోపిన రాజద్రోహం నేరానికి సంబంధం ఏవిటి యువరానర్?

ఉంది యువరానర్....చాలా సంబంధం ఉంది. ఈ సారా అమ్మకం వల్ల కాంట్రాక్టర్ల ఆదాయం పోను, ఎక్సైజ్ శాఖ సిబ్బంది జీతభత్యాలు పోను, మన రాష్ట్ర ప్రభుత్వానికి సంవత్సరానికి 880 కోట్ల రూపాయలు ఆదాయం వస్తోంది యువరానర్.... ఈ ఆదాయం ప్రతి సంవత్సరం పెరుగుతూ, రాబోయే సంవత్సరాల్లో అమోఘంగా పెరగనున్నది. ప్రభుత్వ ఆదాయాల్లో మూడవ వంతు ఈ సారా వల్లే వస్తోంది. అటు వంటి సారాని ఇంకా ఇంకా తాగమని ప్రోత్సహించి, ప్రభుత్వ ఆదా

యాన్ని మరింత పెంచి ప్రభుభక్తిని చాటుకోవాల్సింది పోయి, 'నేను సారా తాగను....మీరు తాగొద్దు' అని ఈ....గౌరవనీయులైన తాగుబోతు ప్రజల్ని రెచ్చగొట్టి, ప్రభుత్వ ఆదాయాన్ని పడేసి స్తంభింప చేయాలని చూస్తూ రాజద్రోహానికి ఒడిగట్టారు. కనుక ఈ మాల కొండయ్య, వరాలమ్మా, సత్యం మాష్టారు అనే ముద్దాయిలు ప్రభుత్వాన్ని కూలదోయాలనే కుట్ర చేశారు.... మైడియర్ జస్టిస్.

డి. లా : ఇది చాలా దారుణం యువరానర్....చాలా దారుణం - 'సారా తాగను' అనడమే నేరం అయితే ఇంతకు మించిన దారుణం ఇంకొకటి లేదు. చట్టం ...శాసనాలు....లా...సంగతి ఎలా ఉన్నా....దీన్ని నీతికి చెందిన అంశంగా ఆలోచించండి యువరానర్. సారా తాగినందువల్లే అనేక నేరాలు జరిగాయి....జరుగుతున్నాయి. శాంతి భద్రతల సమస్యలను సృష్టించేది ముఖ్యంగా ఈ సారాయే యువరానర్. ఆ నేరాలకు స్వయంగా కోర్టులే శిక్షలు విధించాయి. అంతెందుకు యువరానర్, ఇదే మాలకొండయ్య సారా త్రాగి గొడవ చేశాడని, మర్డర్ చేశాడని మన కోర్టులే శిక్ష వేశాయి. కావాలంటే ఈ మాలకొండయ్య కేసు పాత రికార్డులు తిరగేయండి యువరానర్. పాత రికార్డు తీయండి. ఈ సారా వల్ల మాలకొండయ్య జీవితం ఎలా చిందరవందర అయ్యిందో చూడండి. ఈ సారా వల్ల మాలకొండయ్య కుటుంబం ఎంత నాశనం అయ్యిందో చూడండి... చూడండి!

[మాలకొండయ్య కొడుకు నాగేశు తాగి ఇంటికి వస్తూంటాడు.]

నాగేశు : హేహేహే....తాగుబోతు నాయాలా....

తాగినాక ఉయాలా
ఉగ్గుతో ఊగుతావు ఆయాల
పెగ్గుతో తూగుతావు ఈయాల
తాగకుండ ఉండేది ఏయాల
తాగినాక అవుతావు తం-దా-నా.

వరాలమ్మ: నాగేశు....(గద్దిస్తూ) ఒరే నాగేశూ....ఏందిరా ఈ పని?

నాగేశు : అమ్మా....అమ్మే....ఏం....ఏం లేదమ్మా (అంటూ కూలిపోతాడు.)

వరాలమ్మ: ఏం లేదంటావేమిరా సన్నాసి....సన్నాసి పని చేసొచ్చింది కాక, ఇంకా ఏం లేదంటావేమిరా....నీకీ పాడు అలవాటు ఎప్పణ్ణించిరా....మీ అయ్యతోనే 'సావుకొచ్చిందిరా దేవుడో' అంటే, నువ్వు కూడా సారా తాగి తందనాలాడ్తావురా.

నాగేశు : ఛీ....ఛీ....సారానా....ఇన్‌సల్ట్....మావోడి అభిమాన సంఘానికే ఇన్

సల్ట్. మేకడోలు విసికీ....ఎత్తిన బాటిల్ దించకుండా తాగాలని పోటీ ఏసుకున్నాం....ఎవురు గెలిశారు?....నీ కొడుకు....అంటే మనం! (కాల రెగరేసి) మనమే గెలిసింది. గెలిశానన్న సంతోషంలో ఇంకో బాటిల్ పీల్చేశా. (వాంతి చేసుకుంటాడు.)

వరాలమ్మ: ఛీ....ఎదవన్నర ఎదవ....మీ అయ్య తాగి తాగి ఇల్లా, ఒళ్ళా గుల్ల చేశాడు, పనికెళ్ళి నేను తెచ్చినదంతా లాక్కుని సారా కొట్టుకే సదివిత్తన్నాడు. ఇంట్లో కంచాలు, మంచాలు అన్నీ అమ్మాడు. ఆఖరికి....ఆఖరికి నా మెళ్ళో వుస్తెలు కూడా అమ్ముకుని తాగేశాడు. ఇంట్లో పెళ్ళికెదిగిన కూతురుందని ఆయనకి లేదు ...నీకేమొచ్చిందిరా. సెట్టంత ఎదిగినా బుద్ధి, జ్ఞానం లేకుండా పోయిందేవిరా....ఇవ్వాళ చూడు, మీ అయ్య చేసిన ఘనకార్యం.... నేను కూలీకెళ్ళి తెచ్చిన డబ్బులతో కొన్న పదికిలోల బియ్యం కూడా ఎత్తుకుపోయాడు. ఆ బియ్యం అమ్మేసి, తాగి ఎక్కడ తందనా లాడుతున్నాడో....

మాలకొండయ్య: (తూలుతూ వస్తూ) ఏయ్....ఎవరదీ....వుష్షా....ఏంటే, పాడుగోల ఇంట్లో....ఎప్పుడొచ్చినా ఒకటే గోల....ఏం పోయాయని గోల... మణులు పోయాయా....మాణిక్యాలు పోయాయా.... బియ్యమేగా.... బియ్యం గురించేనా లబలబ లాడిపోతున్నావు....నీ యమ్మ... సుక్కేసుకొత్తే సేపల కూరొండే దిక్కులేదు గానీ....ఒక్క బియ్యం వొండి ఏంటి సేత్తావే వరాలూ....కూరలేని కాడికి బియ్యం ఎందుకని.... నేనే అమ్మేశా....ఆసినీ....బియ్యం కూడా ఇంట్లో లేకుండా చేసానే అని మా శెడ్డ బాదేసిందే వరాలు. ఆ బాద మర్సిపోడానికే సుక్కేసుకొచ్చా.... ఏం అనుకోబాక....

వరాలమ్మ: నీ జిమ్మడ....ఇంట్లోకి కాసిని గింజలు తెచ్చేది లేదు గానీ.... అక్కడా, ఇక్కడా పనిచేసి తెచ్చిన గింజల్ని గంజినీళ్ళు కూడా లేకుండా చేశావా... నీ చేతులిరగ. తాగి ఇంటికొచ్చావు. ఏదన్నా గోతిలోనన్నా పడక పోయావా....ఒకేడుపు ఏడ్చి ఊరుకునే వాళ్ళం.

మా.కొ : ఏటే....ఏటీ....మరీ పేట్రేగిపోతున్నావ్.... నీయవ్వ నేను.... నేను గోతిలో పడాలా....ఏంటే కూశావు? (తంతాడు)

నాగేశు : నాన్నా....నాన్నా....అమ్మని కొట్టమాక....అమ్మకి జ్వరం వచ్చి నిన్నటి నుంచి ఏం తినలేదు నాన్నా.... (అడ్డు పడతాడు.)

వరాలమ్మ: కొట్టు....ఆ కొట్టేదేదో సచ్చేటట్టు కొట్టు... ఒక్కసారే పీడ విరగడవుద్ది....రోజూ నీతో సచ్చేకన్నా ఒక్కసారే సావడం మేలు. నిన్ను చూసి....అదిగో, ఆ ఎదవ సన్నాసి ....నాగేశు కూడా నేర్చుకున్నాడు.

మా.కొ : ఓసోస్.... ఊరోర్కెవహే.... సత్తా, సత్తానని బెదిరించే సవితే గానీ, సచ్చిన్నా సవితే లేదంట....అయినా మనకేటి తక్కువ. ఇంకా రెండెక రాల మెట్ట మిగిలిందే. అయినా నువు సత్తే ఎట్టాగే వరాలూ....నువ్వు సత్తే సుక్కేసుకోడానికి డబ్బులిచ్చే వాళ్ళు లేక నేనూ సచ్చిపోతే, భర్తను చంపిన పాపం సుట్టుకుని నరకంలోకి పోతే నే జూశ్శనే. అందు కని బతకవే వరాలూ... నువ్వూ లేక, నేనూ లేక మన లచ్చి పెళ్ళెవుడు చేస్తాడే.... ఈ నా కొడుకు నాగేశుగాడు చేత్తాడా.... ఏరా నాగేశుగా, ఆ మాజీ మంత్రి గోరెనక కుక్కలాగా తిరగడవేనా....ఉజ్జోగం ఏవన్నా ఏపిత్తాడా....ఏవంటున్నాడ్రా?

నాగేశు : మా మంత్రిగారా....అదే మాజీ మంత్రిగారుకి ఎలెక్షన్లు రావాలి.... ఓట్లు వేయించాలి. ఆయన గెలవాలి....మళ్ళీ మంత్రవ్వాలి. అప్పుడేపిస్తా నన్నాడు ఉద్యోగం. అప్పటిదాకా ఆయన దగ్గరే ఉండమన్నాడు.

వరాలమ్మ: అడట్టా ఎమ్మెల్లేల కాడ, మంత్రుల కాళ్ళకాడ కుక్కలా పడుంటాడు. అడు ఉసిగొల్పి నప్పుడల్లా అళ్ళు పోసింది తాగి, ఆళ్ళనీ ఈళ్ళని కొట్టొ స్తుంటాడు. నువ్వేమొ పని పాటా లేకుండా, ఇంట్లో ఉన్నవన్నీ ఎత్తు కెళ్ళి అమ్ముకుని తాగొచ్చి మమ్మల్ని తన్ని తగలెయ్యి. ఆ మిగిలిన రెండెకరాల మెట్ట కూడా కరిగించేయి. దాన్ని చూసన్నా అప్పు దొరుకు తోంది. ఆ దిక్కు కూడా లేకుండా చేయండి. ఇద్దరి కిద్దరే తయా రయ్యారు తాగుబోతులు. మీకు బుద్ధీ, మాకు చావు ఎప్పుడొస్తదో.

మా.కొ : ఛత్—నీ యవ్వ—ఎప్పుడు ఇంటికొచ్చినా తాగొచ్చిన సరదా అంతా సంపేత్తావు. నిషా దిగిపోయిందంటే నీ యమ్మ—మళ్ళీ తాగాల్సి వచ్చుద్ది. నువ్వే డబ్బులియ్యాల్సొచ్చుద్ది.

వరాలమ్మ: తాగు—పీకల దాక తాగు. నువ్వూ, అడు ఇట్టా తాగి తందనాలాడి, ఇంటి సంగతి గాలి కొదిలేసేయండి. ఊళ్ళో తాగుబోతు కుక్కలు ఇంట్లో ఎదిగొచ్చిన ఆడపిల్లని చూసి నానా కూతలు కూస్తున్నా పట్టిం చుకో బాకండి. ఎల్లి ఇంకా తాగి సావండి—

మా. కొ : ఆ—ఏంటే—వరాలు—తాగనా— భలే మంచి మాటన్నావే వరాలు. ఆ—తాగుతా— (రోడ్డు మీదకొచ్చి)—తాగుతా నీ యబ్బ తాగుతా. తాగుబోతు నాయాళ్ళ తల్లో దూరెళ్ళతా—తాగని నా కొడుకెవ్వడు ఈ లోకంలో. సొరగ లోక మగబడుతది మైకంలో. అరేయ్, ఛాలెంజ్—సవాల్—బస్తీ మే సవాల్. (సత్యం మాస్టారుని చూసి) న....నమస్కారం మాస్టారూ.

సత్యం : ఏం మాలకొండయ్యా—ఎన్నిసారు చెప్పాలి ఈ తాగుడు మానమని—

మా. కొ. : అట్టాగే మాస్టారు మానేత్తానండి. బియ్యం అమ్మేశాననే బాధతో తాగేశానండి—కాసంత సేపాగి మానేత్తానండి—సిన్ని పనుంది. మీరెల్లి రండి బాబూ—మీరెల్లిరండి (మాస్టారెళ్ళిపోతాడు) ఎవఁడ్రా ఆడు—నా లచ్చిని చూసి ఎఱ్ఱి కూతలు కూసింది ఎవుడ్రాడు—దమ్ముంటే బయటకు రారా—నా కొడక—అరేయ్—సుబ్బిగా—తాగంగానే సరిపోదురా—నీతి—నాలాగా నీతి ఉండాల్రా నాయాలా—బయటకి రారా సుబ్బిగా—తాగొచ్చి నా లచ్చి కొంగట్టుకుంటావురా—ఇప్పుడ్రారా ఛాలెంజ్—బస్తే మే సవాల్.

సుబ్బిగాడు : ఎవడ్రాడు—నా పేరెత్తిందెవరు?—నా ఊసెత్తిం దెవఁడ్రా?—ఏరా మందెక్కువైందా తెగ తిడతన్నావ్!—తిన్నగా రానీయ్ మాటలు (తూలిపోతాడు.)

మా. కొ. : రేయ్—సుబ్బిగా—నా కొడక—నీకు లాగా అనుకుంటున్నావా—నిప్పురా—మనం నిప్పు—ఏంటిరా—నీకెంత ధైర్యంరా—ఈ మాల కొండడి కూతుకొంటి మీద సెయ్యేయ్యడానికి?

సుబ్బి : ఓ యబ్బో—మాలకొండి గాడొక మారాజు—ఆడి కూతురొక రాకుమారి సెయ్యేత్తాన్రా-సెయ్యేయ్యడమే గాదురా-లేవదీసుకు పోతారా-ఏం చేస్తావురా తాగుబోతు నా కొడకా?

మా. కొ. : ఏంటిరా కూశావ్—నా కొడక—రేయ్—నీ యవ్వ.

[ఇద్దరూ కలబడి పెనుగులాడుకుంటూ రంగ స్థలంలోంచి నిష్క్రమణ]

o o o

కోర్టు జవాను : సైలెన్స్ — మాల కొండయ్యా — మాల కొండయ్యా — మాల కొండయ్యా—

[పోలీస్ మాల కొండయ్యను తీసుకు వచ్చి నిలబెట్టి శాల్యూట్ చేస్తాడు.]

సుబ్బారావు—సుబ్బారావు—సుబ్బారావు.

సుబ్బా : దేవుని ఎదుట ప్రమాణం చేసి అంతా నిజమే చెబుతాను.

పి. పి. : నీ పేరు

సుబ్బా : సుబ్బారావండి

పి. పి. : ఏ సుబ్బారావయ్యా

సుబ్బా : అబ్బినేని సుబ్బారావండి [జనం నవ్వితే జవాను సైలెన్స్ అంటూ ఉండాలి]

పి. పి. : ఆ—చూడయ్యా—నిన్నెవరు కొట్టింది—గుర్తు పట్టగలవా?

సుబ్బా : అదుగోనండి—ఆ మాల కొండయ్యేనండి.

పి. పి. : ఏం జరిగిందో చెప్పు.

సుబ్బా : అడిగో—అడండి—ఆ మాల కొండయ్యండి—రోజూ తాగుతాడండి తాగుతాడా అండీ—తాగొచ్చి ఇంట్లో అందర్ని కొడతాడండి—ఒకటే గోల గోల సేత్తాడండి—ఈడి గోలకి ఆ ఈదిలో ఎవురికీ నిద్దట్లుండ వండి—ఇరుగూ పొరుగూ ఎళ్ళి ఏందెహె ఈ గొడవ పొద్దుగూకులూ అంటే అళ్ళ మీద మీద కెళ్తాడండి—మొన్నండి ఉత్తి పుణ్యాన నన్ను చితకొ_ట్టేశాడండి.

పి. పి. : యువరానర్—మాల కొండయ్యనే ఈ తాగుబోతు—బాగా తాగి వీధంతా న్యూసెన్స్ చేస్తాడు. తాగిన మైకంలో ఆ ముద్దాయి ఈ సుబ్బారావుని కోట్టడం వల్ల దెబ్బలు బాగా తగిలాయి యువరానర్.

డి. లా : మైడియర్ జస్టిస్—నేను మీ అనుమతితో ఈ సాక్షిని క్రాస్ ఎక్జామిన్ చేస్తున్నాను. చూడు సుబ్బారావు—ఈ మాల కొండయ్య ఎన్నాళ్ళుగా నీకు తెలుసు?

సుబ్బా : చాలా కాలం నుంచి తెలుసండి.

డి. లా : ఇద్దరూ ఒకరికొకరు బాగా తెలుసా?

సుబ్బా : బాగా ఏటండీ—ఒకే వీధిలో ఉంటున్నాం.

డి. లా : మీ ఇద్దరూ కలిసే బజారెళతారు కదూ.

సుబ్బా : ఆ—వెళ్ళతాం అండీ.

డి. సా : ఇద్దరూ కలిసే సారా కొట్టుకు కూడా వెడుతారు కదూ?

సుబ్బా : ఆ—ఎళ్ళేవా—అప్పొస్పా—అడు నన్ను కొట్టేక మానేశానండి.

డి. లా : అదేలే—మొత్తానికి నువ్వు కూడా తాగుతావు.

సుబ్బా : అప్పుడప్పుడండీ—కొద్ది కొద్దిగా అండీ.

డి. లా : ఎప్పుడెప్పుడు తాగాలనిపిస్తుంది సుబ్బారావు?

సుబ్బా : చేతిలో పైసలై పోయి నూకల్లేనప్పుడు సిరాకే స్తది కదండీ—సిరాకు మర్చి పోడానికి తాగాలనిపి త్తదండీ—మల్లీ పని కెళ్ళినపుడు పైసలొ త్తయి కదండీ! మా చెడ్డ హుశారుగా ఉంటదండీ—ఆ అనందంలో తాగాలని పి త్తదండి.

డి. లా : అది సరేగానీ—మాల కొండయ్య ఎందుకు కొట్టాడన్నావ్?

సుబ్బా : అయ్యబాబోయ్—దేవుడి మీ దొట్టండి—ఉత్తి పుణ్యానే కొట్టాడండి.

డి. లా : చూడు సుబ్బారావు—మీ వీధిలో మంచినీళ్ళ పంపు ఎక్క_డుంది?

సుబ్బా : మా ఇంటి ఎదట్నే నండి.

డి. లా : ఆ పంపు దగ్గర నీళ్ళు పట్టుకోవడానికి మాల కొండయ్య కూతురు లక్ష్మి వస్తూ వుంటుంది కదూ?

సుబ్బా : మరేనండి—నేను పని కెళ్ళేటప్పుడే వత్తాదండి. అదేటోనండి నే పని లోంచి తిరిగి వచ్చేటప్పుడు కూడా వత్తదండి—నే సూత్తానే ఉంటానండీ

డి. లా : అంటే లక్ష్మి ఎప్పుడెప్పుడు వస్తుందో నీకు బాగా తెలుసునన్నమాట.

సుబ్బా : హి—హి—హి—తెలుసండీ.

డి. లా : నువ్వా అమ్మాయిని తాగిన మైకంలో కొంగుపట్టి గుంజినావనీ, అందుకే నిన్ను కొట్టాడని, నీవు చేసిన తప్పు కప్పిపుచ్చుకొడానికే తిరిగి ఆయన మీద కేసు పెట్టావని—నేను అంటున్నాను—

పి. పి. : ఐ అబ్జెక్ట్ యువరానర్—డిఫెన్స్ లాయరుగారు కేసుని తప్పుదోవ పట్టించడానికి కాకమ్మ కథలు అల్లుతున్నారు. అసలు జరిగిందేమిటంటే- ఆ అమ్మాయే ఈ సుబ్బారావుతో మాట్లాడేది. ఇతనితో స్నేహంగా ఉండేది. ఇద్దరూ సినిమాలకి, షికార్లకు తిరిగేవారు. అది తెలిసి మాల కొండయ్య తన కూతుర్ని అదుపులో పెట్టుకోకుండా తాగి, ఆ మైకంలో కొట్టాడండి—ఏం సుబ్బారావు! అంతేకదూ?

సుబ్బా : ఆ—ఆ—అంతేనండి. తల్లి తోడు—దేవుడి తోడు—అక్షరాలా నిజ వండి. మాలకొండయ్య ఎప్పుడూ తాగుతూనే ఉంటాడు కదండి— ఇంట్లో పైసా యివ్వడండి మరి ఇల్లెట్లా గడుసుద్దండీ—అందుకే ఆడి కూతురు నా బోటిగాళ్ళను వల్లో ఏసుకుని సంపాయిచ్చుద్దండి.

మా.కొ. : అరేయ్—సుబ్బిగా

కో.జ. : సైలెన్స్—

[మాలకొండయ్య మినహా మిగిలినవాళ్ళు నిష్క్రమిస్తారు—మాల కొండయ్య తూలుతూ—]

మా.కొ. : అరేయ్—సుబ్బిగా—కోర్టులో తప్పుడు సాచ్చీకం చెప్పడం గాదురా- ఇక్కడికి రారా—

సత్యం : మాలకొండయ్య!-నీకెన్నిసార్లు చెప్పాలయ్యా—కోర్టు జరిమానా వేసినా మానవా-

మా.కొ : నమస్తే మాస్టారూ—వెయ్యి రూపాయలు జరిమానా ఏశారనే బాధతో తాగేసేనండి—ఇక మానేత్తానండి— మీరెల్లిరండి బాబు— అరేయ్ ఎవ డ్రాడు—ఛాలెంజ్.

వరాలమ్మ: ఏంది మావా—మళ్ళీ తాగొచ్చావా....ఇప్పుడు మళ్ళీ ఎవరితో గొడవ పెట్టుకోడానికి....అయిన గొడవలు సాలు....రా....ముందు ఇంట్లోకి రా.

మా.కొ. : ఉష్షూ....నే రాను....రానంటే రానంతే....ఇయ్యాల ఆడో....నేనో తేలి పోవాల—అంతు చూస్తా—రేయ్ సుబ్బిగా! రారా!-ఛాలెంజి—కోర్టులో అబద్దాలు చెప్పడం గాదురా—ఇక్కడికి రారా తేల్చుకుందాం—నా

కూతురు కేసి చూసి తాగిన మైకంలో ఎర్రి కూతలు కూసి—ఈల ఏసింది కాక, కోర్టులో అబద్దాలు సెపుతావా—రేయ్ దమ్ముంటే—రారా.

వరాలమ్మ: ఏందా కేకలు—ఆడో తాగుబోతు—తాగి ఆడు అల్లరి చేశాడు. నువ్వో తాగుబోతు—నువ్వేమో ఇల్లెక్కి అరిచావు—గొడవ పెట్టుకున్నావు. కొట్లాట కెళ్లావు—కుటుంబాన్ని బజారు కీడ్చావు. పెళ్ళికాని ఆడపిల్ల మీద లేనిపోని మాటలు పుట్టించి వాగారు. ఇక దానికి పెళ్ళికాదు. జరిగింది చాలు ఇక ఊరుకో.

సుబ్బా : (తూలుతూ వచ్చి) ఎవడ్రాడు—నా పేరెత్తే నా కొడుకు ఎవడ్రా—అరేయ్ నువ్వేనా—మాలకొండే—మళ్ళీ నా ఊసెత్తేవా మర్యాద గుండదు.

మా. కొ : రేయ్—సుబ్బిగా....ఏందిరా కోర్టులో వాగావు....ఇక్కడ—వాగు.

సుబ్బా : ఎక్కడైనా అంటాన్రా—అంటా—నాకేంటిరా!

మా. కొ : ఏంటిరా—నా కూతురు—నీతో సినిమాలకీ—షికార్లకీ వచ్చిందా—నా కూతురు తిరుగుబోతా—ఇప్పుడు వాగు.

సుబ్బా : అంటాన్రా—నాకేంటిరా—అరేయ్ నాతో మజాకా కాదు. కోర్టులో వెయ్యి రూపాయలు జరిమానా కట్టించానా—ఈసారి జైలుకి పంపిత్తా-అట్టే వాగమోక నా ఊసే త్తమాక.

మా. కొ : నీ యవ్వ—తప్పుడు సాచ్చీకం చెప్పి—నా కూతురిని బజారు మనిషి అంటావురా—నాయాల—నువ్వు బజారు మనిషివిరా—నీ పెళ్లాం డబల్ బజారు మనిషిరా—నీ యమ్మ త్రిబుల్ బజారు మనిషిరా.

సుబ్బా : అరేయ్—నోర్ముయ్—డొక్క సీరేత్తా నా కొడకా—(చొక్క పుచ్చుకుంటాడు)

మా. కొ : చొక్క పుచ్చుకుంటావురా—(కత్తి తీసి) ఇయ్యాల నువ్వో—నేనో తేల్చుకుందాం—రారా-(పెనుగులాడుతారు-పేటలో కొందరు, వరాలు, సత్యం మాస్టారు విడదీయ నొస్తారు. అయినా కత్తితో సుబ్బారావుని పొడిచేస్తాడు)

(అందరూ "అమ్మో—పొడిచేశాడు— చంపేశాడు" - అంటూ పారిపోతారు. పోలీస్, ఎస్సై వస్తారు.)

ఎస్.ఐ. : ఎవరు? - ఎవరు ఈ ఖూనీ చేసింది? - మాలకొండయ్య ఎక్కడ? ఏయ్ త్రీనాట్ ఫోర్! మాలకొండయ్యను కస్టడీలోకి తీసుకో - ఆ కత్తి సీజ్ చేయ్ - మీరు -

సత్యం : నేను ఎలిమెంటరీ స్కూల్ టీచర్ నండి—నా పేరు సత్యం.

ఎస్. ఐ : చూడండి మాస్టారు—జరిగిందేమిటో మా కానిస్టేబుల్‌కి చెప్పండి. మీ స్టేట్‌మెంట్ రాసుకుంటాడు. ఏయ్ త్రీనాట్ ఫోర్! టేప్ తీసుకుని కొలువు—సీన్ ఆఫ్ అఫెన్స్ షీట్ తయారు చేయ్—నెత్తురుతో తడిసిన మట్టిని కూడా సీజ్ చేయ్—అన్నీ అయ్యాక శవాన్ని పోస్టు మార్టమ్‌కు పంపండి.

(మాస్టారు, కానిస్టేబుళ్ళు సుబ్బారావు శవాన్ని మోసుకుపోతారు)

ఎస్. ఐ : (మాల కొండయ్యను తోసుకుంటూ) పద—తాగుబోతు నాయాలా—ఉన్న పాళాన నిండు మనిషిని చంపేశావు కదరా—పద! నీ పని స్టేషన్లో చెబుతా—పీకల్దాకా తాగేది—కత్తులతో పొడుచుకు చచ్చేది. ఒక్కరోజు కూడా తాగకుండా ఉండలేరు—నీకు లైఫ్—ఖాయం—పదరా తాగుబోతు నా కొడకా—(నిష్క్రమణ)

o o o

వరాలమ్మ: మాస్టారూ—మాస్టారు! ఈయన్ని రాత్రనంగా స్టేషన్‌కు తీసుకెళ్ళారు—ఏం చేస్తున్నారో ఏమో—ఒక్కసారి వెళ్ళొద్దాం రండి-(పోలీస్ స్టేషన్ ముందు సత్యం మాస్టారు, వరాలమ్మ ఉంటారు)

కానిస్టేబుల్: ఏయ్—ఎవరు మీరు—పోలీస్ స్టేషన్ ముందేంటి? అవతల మా ఎస్సైగారొచ్చే టైం అయ్యింది.

వరాలమ్మ: మా అయన్ని తీసుకొచ్చారు కదండీ!

కానిస్టేబుల్: రోజుకి లక్ష తొంబైమంది పనికిమాలిన వెధవ లొస్తుంటారు మా స్టేషన్‌కి.

వరాలమ్మ: మాది ఈ ప్రక్క ఊరేనండి-మా ఆయన పేరు మాల కొండయ్యండి.

కానిస్టేబుల్: ఆ తాగుబోతు మాల కొండయ్యేనా-అయితే-ఏంటి? అడు మర్డర్ కేసు ముద్దాయి. అంత తేలిగ్గా వదలరు. ఎల్లెండెల్లండి.

సత్యం : కోర్టులో ఎప్పుడు హాజరు పెడతారో కనుక్కుందామని వచ్చామండీ.

కానిస్టేబుల్: మేమెవరమండీ చెప్పటానికి-మా మీద ఎస్సై ఉన్నాడు. ఆయన మీద సి.ఐ., ఆ పైన డి.యస్పీ-ఇంకా పైన ఎస్పీ దొరగారున్నారు. పోస్టు మార్టమ్ రిపోర్టు రావాలి-ఎఫ్.ఐ.ఆర్ రాయాలి-ఆ తరువాత కోర్టులో పెట్టేదీ లేనిదీ కూడా చెప్పడానికి నేనవర్నండి మాస్టారు? (కానిస్టేబుల్‌కి లంచం ఇచ్చినట్లు అభినయం-అది జేబులో పెట్టుకుని-)-ఉండండి-రైటరు గార్ని కనుక్కుని వస్తాను- (వెళ్తాడు)

వరాలమ్మ: ఆయన్ని కొట్లో ఏసి కొడతారేమోనండి—బాగా తాగి తాగి గుండెలు అరిపోయిన మనిషి-జరగరాందేవన్నా జరుగుదేమో మాస్టారు—

సత్యం : అవును-వరాలమ్మ-ఈ మధ్యన అనేకచోట్ల లాకప్ హత్యలు సర్వ సాధారణం అయిపోయాయి.

వరాలమ్మ: మీరెళ్ళి మాట్లాడి రండి మాస్టారు.

మాస్టారు : మాట్లాడానికేం-నేను వెళ్ళి మాట్లాడతాను. కానీ వాళ్ళు వినొద్దూ-ఇదేమో మామూలు కేసు కాదయ్యే-మర్డర్ కేసు—ఈ మధ్య పోలీసోళ్ళు చిన్న దానికీ, పెద్దదానికీ లంచం అడుగుతున్నారు. లేదా ఎవరన్నా పెద్ద వాళ్ళతో ఫోన్ అన్న చేయించాలి.

కానిస్టేబుల్: ఇదుగో వరాలమ్మ, ఇట్లారా! మీరుండండి మాస్టారు! (అని చెవులో ఏదో చెప్పినట్లు అభినయించాడు.)

వరాలమ్మ: మీరన్నదే జరిగింది; డబ్బులకు గేలం వేస్తున్నాడంట ఎస్.ఐ మరి లాయరుకి, కోర్టులో ఖర్చులకి డబ్బు లెట్టాగూ కావాలి—మొన్ననే నండి కోర్టులో జరిమానాకు వెయ్యి రూపాయలు అప్పు చేశాను. ఇప్పుడు ఈ కేసు మీద పడింది. ఉన్న మెట్ట పొలం అమ్మితేగానీ రావు—ఆడదాన్ని అంత అప్పు ఎక్కడ తెచ్చేది—ఆ భగవంతుడు ఇలా రాశాడు నా తలరాత.

సత్యం : తలరాత గాదు-చేతి రాత కాదు-ఆ మాయదారి సారా తాగుడు ఇన్ని అన ర్థాలకు కారణం.

వరాలమ్మ: నిజమేనండి మాస్టారు-నా చిన్నతనంలో తెలీకుండా తాగి సచ్చేవారు. బిక్కు బిక్కు మంటూ తాగి గుట్టుగా ఇంట్లో తొంగునేవాళ్ళు—ఈ గవర్నమెంట్ సారా వచ్చాకా ఇట్లా తాగి వీధినపడటం-వీరంగా లాడ్డం—విచ్చలవిడి అయిందండి. సంసారాల్ని కూల్చే స్తందీ మాయదారి సారా.

సత్యం : అంతేనా—వరాలమ్మా—మన వీధి చివర్న ఉండే డ్రైవర్ మల్లయ్య బాగా తాగి లారీ తోలి చెట్టుకు గుద్దేశాడు. మల్లయ్య, అతనితో బాటున్న మరో నలుగురు సచ్చిపోయారమ్మ.

వరాలమ్మ: ఈ సారా మీద మన్ను పొయ్య! అసలెందుకండీ సారా? ఈ మాయదారి సారా లేకుండా వుంటే ఎంత బావుణ్ణు. అది లేకుండా సేత్తే ఎన్ని సంసా రాలు బాగుపడతాయో.

సత్యం : నేను మొత్తుకుని చెప్పేదీ అదేనమ్మా—ఎవరూ అర్థం చేసుకోవటం లేదు.

వరాలమ్మ: మన పేటలో ఆడోళ్ళనందరినీ నేను పిలుచుకొత్తా మాస్టారు—మీరు పాఠం చెప్పినట్లు చెప్పండి—ముందు మన పేటలోఉన్న సారాకొట్టు ఎత్తే యించాలండి.

వరాలమ్మ: ఓ - ఎంకమ్మా — సుబ్బమ్మా — రావులమ్మా (అని పిలుస్తూ నిష్క్ర మణ)

సత్యం : ఇన్నాళ్ళకి నే ననుకున్నది కార్యరూపంలోకి వస్తోంది. కొన్ని బతుకులు చితికిపోతేనే గానీ చేదు నిజం గ్రహించక పోవటం విచారకరం— చితికిన బతుకులే చితుకులై రగిలి ఈ సారా రాజ్యాన్ని అంతం చేస్తాయి సారాను బంద్ చేస్తారు....సారా బంద్— సారా బంద్.

* * * *

(సారా కాంట్రాక్టర్ అయిన మాజీ మంత్రి ఇంట్లో దృశ్యం)

మా.మం : రేయ్— ఎవడ్రా అక్కడా?

మేనేజర్ : యస్— సార్.

మా.మం : ఇదుగో మేనేజరూ— నిద్రపోతున్నావా— మెలుకువగా ఉన్నావా—

మేనేజర్ : ఏంటండీ— ఏంటి?

మా.మం : ఏంటీ అని అంత నింపాదిగా అంటావేమయ్యా— ఆ ఊళ్ళో మన సారా జీపుని వెనక్కి తిప్పి పంపారట. ఎన్ని గుండెలు వాళ్ళకు? ఈ జిల్లాకే సారా రాజుని, మాగంటి బాలా అంకారెడ్డిని. నా జీపునే అటకాయిస్తారా— నన్ను సారా అమ్మొద్దు అంటారా? ఎవరు? ఎవరు వాళ్ళు?— నాకు సాయంత్రం లోపల వాళ్ళ వివరాలు కావాలి.

మేనేజరు: షాపు గుమాస్తా వచ్చాడండి.

షాపు గుమాస్తా: నమస్కారం అయ్యా!— ఊళ్ళో పరిస్థితేం బాగోలేదండి. ఊళ్ళో ఆడోళ్ళందరూ ఏకమై మన షాపు మీద కొచ్చారండీ— కొందరేమో మన జీపుని వెనక్కి పంపారండి— రేపట్నించి సారాని అమ్మడానికి వీల్లేదని నానా అరుపులు అరచి వెళ్ళారండి. నాకు ఆ జనాన్ని చూసేటప్పటికి భయం వేసి, క్యాష్ బ్యాగ్ పట్టుకుని షాపుకి తాళం వేసి, ఇక్కడకు వచ్చేశానండి.

మా.మం : అరేయ్— ఎవడ్రా అక్కడ? కాసిని గాజులు, పసుపు, కుంకుమ పట్రండిరా.

గుమస్తా : అదేంటయ్యా?

మా.మం : లేకపోతే ఏంటిరా— ఉండటానికి ఉన్నావు— కోస్తే ఊరంతా సరిపోతావు. ఆళ్ళు అట్లా షాపు మీద పడితే పోలీసు స్టేషన్కెళ్ళి వారం రోజుల క్యాష్ ఎత్తుకు పోయారనో, నిన్ను చంపడానికి ప్రయత్నం చేశారనో కేసు పెట్టక, ఇక్కడ కొచ్చావు? ఇదుగో మేనేజర్! ఆ—ఎస్సయి గాడిని నేను రమ్మన్నానని ఫోన్ చెయ్. ఇంతకీ ఎవరెవరురా దీనికి కథానాయకులు?

గుమస్తా : ఎలిమెంటరీ స్కూల్ పంతులు లేడండీ— సత్యం మాస్టారు— వాడు ఒకటే వాగుతుంటే, మీ దాకా ఎందుకులే అని ముగ్గురు మన కుర్రాళ్ళని

పంపించి బెదిరించానండి. అయినా లాభంలేకపోయింది. అడు ఊరంతా అంటిం చాడు. అంతా సారా వ్యతిరేక కమిటి అంటూ జెండాలు పుచ్చుకుని గుంపులు గుంపులుగా మనమీద పడ్డారు. ఊరంతా కాపలా కాస్తున్నారండి— సారా తాగితే 150/- రూ॥లు జరిమానా అంట— తాగినట్లు చెప్పినోళ్ళకు 50/- రూ॥లు బహుమానం అంట. ఇవన్నీఆ సత్యం మాస్టారు వెనకుండి చేయిస్తున్నాడండయ్యా.

మా.మం : ఇదుగో మేనేజరు— ఆ మాస్టారు ఎవడో— ఏంటో ఆరా తియ్యి— ఆడి సంగతి మనమే చూద్దాం.

మేనేజరు : ఆ సత్యం మేస్టారు కి నక్సలైట్లతో సంబంధాలున్నాయని తెలుస్తోంది సార్— ఆయనొంటి మీద చేయి పడితే పుచ్చెలు లేచిపోతాయి సార్— అసలుకే మోసం.

మా.మం : అంతేనంటావా— సరే! ఆ డి.ఇ.వో.కు ఫోన్ చేయి. రేపీపాటికి ఆడి నక్కడి నుంచి ట్రాన్స్ఫర్ చేయించాలి — ఇంకా ఎవరెవరున్నారు?

గుమస్తా : పోయిన ఎలెక్షన్లలో మనకు ఓట్లేపిస్తానని వెయ్యి సారా పాకెట్లు తీసుకెళ్ళాడు చూడండి—మాలకొండడు-

మా.మం : ఆ— ఆడిప్పుడేదో మర్డర్ కేసులో ఇరుక్కుని జైల్లో ఉన్నాడు కదూ.

(మిగతా వచ్చే సంచికలో)

---

(4వ పేజీ తరువాయి)

ప్రముఖ చిత్రకారుడు 'బాపు' కుంచెతో మహాకవి గురజాడ చిత్రీకరించిన 'కన్యాశుల్కం' పాత్రల బొమ్మలతో వంద సంవత్సరాల 'కన్యాశుల్కం' ప్రదర్శన సందర్భంగా వెలువడిన 'ప్రజాసాహితి' ప్రత్యేక సంచిక ప్రగతిశీల సాహిత్యాభిమానులందరికి ఆనందాన్ని, ఆలోచనల్ని కల్గించింది. విప్లవ సాహిత్యోద్యమంపై ప్రగతిశీల ముసుగులో దాడి జరుగుతున్న సమయంలో సాహిత్యోద్యమాన్ని జనతా ప్రజాతంత్రదృక్పథంతో విశ్లేషించి కృషిసాగిస్తున్న జనసాహితిని అభినందిస్తున్నాను.

"తనది ప్రజల ఉద్యమంగా భావించి, ఎవరిని సంతోషపెట్టడానికీ దానిని వదులుకోనని" మహాకవి గురజాడ ప్రగతిశీల సాహిత్య ఉద్యమానికి వైతాళిక గీతం ఆలాపించాడు. సమాజపు సామాజిక దృశ్యంగా "కన్యాశుల్కం" నాటకాన్ని రచించాడు. "మృచ్ఛకటికం", "కన్యాశుల్కం" ప్రపంచ సాహిత్యంలో సజీవంగా నిలిచి పోయినవని చెప్పిన శ్రీశ్రీ అందుకే "సన్మానాలు పొందే లక్ష సామ్రాట్టులకన్న ఒక కామ్రేడ్ గురజాడ మే"లన్నాడు.

వంద సంవత్సరాల తర్వాత ఇంత విరివిగా, విస్తృతంగా కన్యాశుల్కం చర్చింపబడడమే రాజులు పోయి రోజులు మారినా, మారని సామాజిక ఆర్థిక సాంస్కృతిక వ్యవస్థ స్వభావాన్ని తెలుపుతుంది. ఈ సందర్భంగా "ప్రజాసాహితి" కన్యాశుల్క నాటకంపై వెలువడిన సంచికలో గతంలో చర్చజరగని అంశాలెన్నింటినో చర్చించే ప్రయత్నం చేశారు. 'కన్యాశుల్కం రచనా సంవిధానం- ప్రదర్శన' వ్యాసంలో కాకరాలగారు మొదటి, రెండవ కూర్పులకు మధ్య గురజాడ పాత్రల చిత్రీకరణలతో నాటి సమాజాన్ని కుహనా సంస్కరణోద్యమాన్ని బట్టబయలు చేయడంలో గొప్ప విశ్లేషణను అందించారు. మధురవాణి 'నవ్వు'పై కవితలు చాలా స్ఫూర్తిగా ఉన్నాయి. "కన్యాశుల్కం"లో ఏ సమస్యకూ సరైన పరిష్కారం లభించలేదని గిరీశాన్ని సంస్కరించి, బుచ్చమ్మతో వివాహాన్ని జరిపించివుంటే బాగుండేదని అభిప్రాయ పడిన నవీన్‌గారికి సమాధానం అలా ఎందుకు జరగలేదో, జరగలేని సామాజిక ఆర్థిక పరిస్థితులేవో రవిబాబు, కాకరాల వ్యాసాల్లో సమాధానం దొరుకుతూంది.

'కన్యాశుల్కం' పూర్తి నాటక ప్రదర్శన తెలుగువారు చూసేందుకు నిజంగానే అబ్బూరి చెప్పినట్లుగా మనం గిల్‌గుడ్ లాంటి ప్రయోక్త కోసం ఎదురుచూడాల్సి వుంటుందేమో!

మహాకవి వెలిగించిన ప్రజాస్వామ్య భావజాల జ్యోతిని మరింత దేదీప్యమానం చేసేందుకు ప్రజల జీవితాలు, వారి పోరాటాలు 'గని'గా సాహిత్యాన్ని సృజించి, సాహిత్యం సామాజిక మార్పులో కీలక సాధనంగా సాగుతున్న సాహిత్యోద్యమాన్ని మరింత ముందుకు తీసుకుపోవడమే. 'కన్యాశుల్కం' ప్రత్యేక సంచికను అత్యంత ఉత్తేజంగా తెలుగు పాఠకులకు అందించిన 'ప్రజాసాహితి'కి అభినందనలు.

—మోహనరావు, హైదరాబాద్.

# పిల్లల ప్రపంచం

## అద్భుత కథలే పిల్లల ప్రపంచం

"మా ఇంట్లో పుస్తకాలు చదివితే ఊరుకోరు అంకుల్" అన్నాడో బాబు విచారంగా. ఎప్పుడూ క్లాసు పుస్తకాలే చదవాలని వారింట్లో నియమం అంట. పిల్లలే కాదు 'మనిషి' అయిన ప్రతివారూ పుస్తకాలు చదవాలి. ముఖ్యంగా పిల్లలకు గొప్ప గొప్ప కథలూ, బొమ్మలూ, ఇవే వారికి స్నేహితులు. 'పిల్లల ప్రపంచం' ద్వారా మేమందరం 'పుస్తకాల'ను చదవనీయని అలాంటి తల్లిదండ్రులపట్ల మా నిరసనను ప్రకటిస్తున్నాం.

క్లాసు పుస్తకాలు చదవటం ఎంత అవసరమో, కథలూ, పాటలూ ఉన్న పుస్తకాలు చదవటం అంతే అవసరం. పిల్లలందరికీ వినోదం కావాలి. రంగు రంగుల కలల ప్రపంచం కావాలి. ఈ రోజున ప్రపంచమంతా బాలల కోసం రంగు రంగుల పుస్తకాలు ప్రచురిస్తున్నారు. అందుకే పిల్లలందరికోసం పెద్దవారు కొన్ని ఖర్చులయినా తగ్గించుకొని నెలకు కొన్ని మంచి పుస్తకాలయినా కొనిపెట్టాలని మేం కోరుతున్నాం.

## బాలల ఆదర్శం

ఈ నడుమ మన రాజధాని నగరం ఢిల్లీలో బాలలు మాకు పాలు కావాలి. 'సారా' వద్దు! అంటూ ప్రదర్శనలు నిర్వహించారంట. చాలా కుటుంబాల్లో వందలాది రూపాయల్ని తాగుడు కోసం ఖర్చు చేసి పిల్లలకు సరైన తిండి కూడా పెట్టని వారున్నారు. అలాంటి తండ్రులందరికీ, ప్రభుత్వానికీ కూడా బాలలు మాకు 'పాలు' కావాలని రోడ్డు మీదకు రావటం ఓ చెంపపెట్టు లాంటిది.

మనకు అలాంటి బాలలు ఆదర్శం కదూ!

---

అదే సమయంలో పిల్లలందరూకూడా తమ క్లాసు పుస్తకాలూ, కథల పుస్తకాలూ వీటిని చదవటానికి సరైన సమయం కేటాయించుకోవాలి. బాలలందరూ అన్నివిధాలా ఎదగటానికి పుస్తకాలెంతో సహకరిస్తాయి. —అంకుల్

కథ :

# బాధ్యత

వనస్థలిపురం అనే గ్రామంలో ఓ పండితుడుండేవాడు. ఆయనకు చాలా శాస్త్రాలు తెలుసు. ఆ కాలంలో ఆయన్ని మహా పండితుడుగా భావించి సన్మానాలు చేయటానికి చాలామంది వచ్చేవారు. నిజానికి ఆయన రచనలు కొంతమందికి మాత్రమే అర్థమయ్యేవి.

ఆ పండితుడికి చదువురాని ప్రజల పట్ల చాలా చిన్నచూపు ఉండేది. వారికి తినటం, పడుకోవటం, పనిచేయటం లాంటి పనులు తప్ప నేర్చుకోవాలనే ఆసక్తి లేదనుకునేవాడు. అలాంటి వారం దరూ తనకేసి అద్భుతంగా చూస్తుంటే గర్వపడేవాడు. వారందరికంటే తాను అధికుడినని భావించేవాడు. ఓసారి ఆయనకు ప్రజలందరి ముందూ సన్మానం చేస్తానంటే అంగీకరించలేదు.

"ఎందుకండీ! వారికి అర్థమవుతుందా, పాడా .... కళా హృదయమున్న పది మంది ఉన్నా చాలు" అన్నాడు.

పండితుడి భావాలు ఓ యువకుడ్ని బాధపెట్టాయి. అతనికో పాఠం చెప్పాలనుకొన్నాడు యువకుడు.

* * *

ఆ గ్రామంలో ఇంద్రజాల ప్రదర్శన చూసి పండితుడు ఆశ్చర్యపోయి స్వయంగా వెళ్ళి అభినందించాడు.

"సర్వ విద్యలూ తెలిసిన మీలాంటి పండితులు నన్ను పొగిడితే నాకు సిగ్గుగా ఉంది. ఇదేం గొప్ప విద్యకాదు. నిజంగా ఈ విద్య మీకు రాదా?" అన్నాడు.

"నాకు రాదే" అన్నాడు పండితుడు ఆశ్చర్యంగా.

"ఈ విద్య ఓ పామరుడితో చేయిస్తా" అని చేసి చూపించాడు.

"మీకు తినటం, పడుకోవటం, పుస్తకాలు రాయటంమించి కొత్త విషయాలు తెలుసుకోవాలనే కళాహృదయం లేదు" అన్నాడాయువకుడు.

పండితుడు నొచ్చుకుంటూ చెప్పాడు, "నాకు అలాంటి అవకాశం లభించలేదు."

"అందరికీ అంతే. ప్రజలకు కళా హృదయం లేదనుకోవటం పొరపాటు. వారి జీవితంలో ఎక్కువ సమయం తిండి సంపాదించటానికే సరిపోతుంది. వారికి నేర్పితే ఎలాంటి కళనయినా నేర్చుకుంటారు. మనం ప్రజలకంటే గొప్పవాళ్ళం కాదు. అంతేకాదు ఏ వ్యక్తీ అన్ని రంగాల్లో గొప్పవాడు కాలేడు. మీరు పండితులైతే వారు శ్రమ చేస్తారు. మీరు చేయలేరు. అందుకే ప్రజల అమాయకత్వాన్ని నిరసించటం మంచి లక్షణం కాదు" అన్నాడు.

పండితుడు ఆ యువకుడి చేతులు పట్టుకొని-

"నాకు గొప్పసత్యం తెలియచేసావు. కృతజ్ఞుడ్ని" అన్నారు.

ఆ తర్వాత పండితుడు ఆ గ్రామంలో రాత్రి పాఠశాల పెట్టి, వారికి అర్థమయ్యే భాషలో జ్ఞానం అందించే ప్రయత్నం ఆరంభించాడు.



# చైతన్య వాహిని

సారా వ్యతిరేక మహిళల పోరాటానికి మద్దతుగా రచయితల, కళాకారుల బహిరంగ సభ—

★ ది. 26-9-92 శనివారం సా॥ 6 గం॥ నెల్లూరు టౌన్ హాల్‌లో సారా వ్యతిరేక పోరాటానికి మద్దతుగా జన సాహితి, అరుణోదయలు సంయుక్తంగా బహిరంగ సభ నిర్వహించారు. అరుణోదయ రాష్ట్ర అధ్యక్షులు దివికుమార్ సభకు అధ్యక్షత వహించారు. జన సాహితి రాష్ట్ర అధ్యక్షులు సూర్యసాగర్ ఉపన్యసిస్తూ పాలక వర్గాలు ప్రజల యొక్క ఆలోచనలను, అలవాట్లను కావాలని, పనిగట్టుకుని నీచ స్థాయికి దిగజారి పోయేలా చేస్తున్నాయని విమర్శించారు. జూదమ నస్తత్వాన్ని, శ్రమ పడాలనే తత్వం పోయి, కొద్ది మొత్తంలో లక్ష లక్ష లొచ్చేస్తాయని అదృష్టం కోసం నిరీక్షణలోనే గడిపేలా చేసేందుకు, రోజువారీ లాటరీలను, సెక్స్ డిటెక్టివ్ సాహిత్యాలను, వీటికి ధీటుగా ఈ సారాను విచ్చల విడిగా వెదజల్లుతున్నారని సూర్యసాగర్ అన్నారు. రాజ్యాంగంలోని 47వ అధికరణలో జూదం, మద్యపానం లాంటివి ప్రభుత్వ ఆదాయ వనరులుగా ఉండరాదని స్పష్టంగా చెప్పినా కనీసం నాను చెప్పుకుపే రాజ్యాంగాన్నే కూడా గౌరవించడం లేదని అన్నారు. ప్రగతి శీల మహిళా సంఘం (స్త్రీ విముక్తి) నెల్లూరు జిల్లా కన్వీనర్ శ్రీదేవి మాట్లాడుతూ సంసారాల్ని కూల్చివేస్తున్న సారాకి వ్యతిరేకంగా నెల్లూరు జిల్లాలో అంత తీవ్ర స్థాయిలో ఉద్యమం రావటానికి కారణం మహిళల కడుపు మంటల్లోంచి రగిలిందని, సారా వ్యతిరేక ఉద్యమంలో నెల్లూరు జిల్లా మహిళల పాత్ర మొత్తం రాష్ట్రానికి స్ఫూర్తిదాయకంగా ఉందని అన్నారు. దివికుమార్ తమ అధ్యక్షోపన్యాసంలో ఇలా అన్నారు. ప్రభుత్వం ఏదో సం॥కి 260 కోట్ల ఆదాయం వస్తుందని మాత్రమే ఈ సారా వ్యాపారం చేస్తోందని అనుకోవడం పొరపాటని, ప్రజల యొక్క చైతన్యాన్ని సారా మత్తులో ముంచెత్తి తమ ఎన్నికల రాజకీయానికి, తమ గూండా చర్యలకు, ఉపయోగించుకోవడమేగాక తమ దోపిడీ ఆర్థిక విధానాలకు ఎటువంటి అవరోధం లేకుండా చేసి తమ వర్గ ప్రయోజనాలు కాపాడుకోవటానికి ఈ సారాను ప్రయోగిస్తున్నారని అన్నారు. ఈ సారాకు వ్యతిరేకంగా తెలంగాణాలో వచ్చిన ఉద్యమాన్ని నక్సలైట్ల ఉద్యమం అని పాలక వర్గాలు, అదే పనిగా ప్రచారం చేశాయి. కానీ ఈ నెల్లూరు జిల్లాలో వచ్చిన ఉద్యమం ముందు నైతికంగా నిలబడలేక పోతున్నాయని అన్నారు. అనంతరం అరుణోదయ కృష్ణాజిల్లా బృందం "శబ్దం" వీధి నాటకం ప్రదర్శించారు.

---

**Edited, Printed and Published by K. RAVI BABU on behalf of JANASAHITI (A.P.). at Chaitanya Printers, Vijayawada-2. for Co-operative Press, Vijayawada.**

**Working Editor : NIRMALANANDA**

# ఎందాకని సహించం

— వి. రామారావు

పొద్దంతా రెక్కలు ముక్కలుచేసి
ఆకలి మంటలతో యిల్లు చేరితే
మావీపులపై సారా మొగుడు కరాళనృత్యం
పిల్లినోట్లో చిక్కిన చిలకై
విలవిల్లాడుతుంటే
పాలకోసం లేగదూడల అరుపుల్లా
అమ్మా ఆకలి! పిల్ల ఏడ్పులు
చాలీ చాలని బతుకుల్లో
నిత్యం సారా ఏసిడ్ ప్రవాహం
కుటుంబాలే దహనం
ఎందాకని సహించం!
కూలిచేసి కూడబెట్టే
మొగుడేమో సారాకొట్టు కంకితం
ఆకలి మంటల్లో మలమల మాడుతూ
ఎందాకని సహించం
చినిగిన చింపుల్తో నిత్య దరిద్రం
ఎందాకని సహించం!
ఈ స్వతంత్ర భారతంలో
మా మానాలు కాపాడలేరు
సారా ప్రభువులకు సాయుధ రక్షణ
మా గొంతు తడిపే నీరులేదు
గల్లీ గల్లీకి సారా కొట్టు
గాంధీతాత పుట్టిన రోజు
సారా ప్రభువులు మెచ్చినరోజు
మా జీవితాలకు ఆఖరి రోజు
మా కుటుంబాలను సారా ఏసిడ్‌లో ముంచి
సంక్షేమ పథకాల్లో ఆరవేస్తారట
ఎందాకని సహించం
మా బతుకుల్లో సారామంటలు చూస్తు
అందుకే ఈ సమర శంఖం
మా బతుకుల్లో వెలుగు కోసం!
సారా సర్కారు సమాధికోసం!!

# వద్దు! వద్దు! తాగొద్దు!

- విన్

తాగు, తాగు, తాగు, తాగు-తాగమంటుందిరో గవర్నమెంటు సారా
ఊగి, ఊగి, ఊగి. తాగి-ఊగమంటుందిరో సర్కారు సారా
సక్కనైన పాకెట్లలో-సారా ఉన్నదండి
సిక్కుకొని దానిచేత-బతికి సావమంది ॥తాగు॥
గాంధీ జయంతినాడు, గమ్మత్తుగ పుట్టింది-సర్కారు సారా
తందానానా, తందానానా, తందానానా
మద్యపాన నిషేదాల మాటెన్నడో మరచిండ్రు
తందానానా, తందానానా, తందానానా
కల్తీసారా తాగి కాటికి ముట్టినా
ఆలి మీద తాళిబొట్టు-తాకట్టు పెట్టయినా ॥తాగు॥
లేవు, లేవు, లేవు నిధులు లేవంటున్నాదిరో-గౌర్నమెంటు తానా
ఖాళీ, ఖాళీ, ఖాళయినాదంటరో-సర్కారు ఖజానా
కల్లు సారా తాపించి-కడుపు నింపు కోను
కష్టజీవులందరిని-కొల్లగొట్టి సంపుకోను ॥లేవు॥
కష్టార్జితమంతా కష్టలకే ముట్టింది
తందానానా, తందానానా, తందానాన
ఇంటిల్లిపాదంత, తిప్పలపాలయ్యింది
తందానానా, తందానానా, తందానాన
ఈ సుక్కమాయ జూడరో-నిన్ను నిలువునా కాల్చిపోయెరో ॥తాగు॥
సూడ, సూడ సారా ధర సుక్కాలంటిపోయె
చందామామ, చందామామ, చందామామ
సారా గుత్తెదారుల మేడలెన్నో పెరిగె
సందామామ, సందామామ, సందామామ
మత్తులోనె సత్తువొడిసెరో-వాళ్ళ దోపిడింక పదిలమాయెరో ॥తాగు॥
వద్దు వద్దు సారా-తాగొద్దంటుందిరో రైతుకూలి సంఘం
సంఘశక్తితోడ మనలు-సాగి రమ్మందిరో పేదన్నల సంఘం
సారా దోపిడెదిరించి-సమ్మె కట్టరండి
సారా తాగుడాపేసి-తెగువ నిలుపుకొమ్మంది ॥వద్దు॥

(అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య ప్రచురణ 'సారా వ్యతిరేక పోరాట పాటలు' సౌజన్యంతో)

---

A Publication of JANA SAHITI (A. P.)